

# జెమినీవారి

# అవ్వయ్యార

శ్రీమతి కె.బి.సుందరాంబాళ్ *నటించినది*



## సెప్టెంబర్ 11 తేదీ మొదలు

ఆంధ్ర దేశంలో ప్రదర్శింపబడుతుంది...



# రీటా హెయిర్ టానిక్



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటికురులను పెంచే అద్భుతమైన హెయిర్ టానిక్. తల వెంట్రుకలు రాలుట, చుండు, బట్టతల మొదలైన కురుల వ్యాధులకు రీటా అమోఘమైనది. మీరుకూడ నేటి నుండియే రీటా వాడుడు. ప్రతిచోటా దొరుకును.




**RITA**
**HAIR TONIC**

---

# వేప - బిల్వ

బిల్వ వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము, సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితములమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కే. యస్. కేసరి    ప్రతి 1-కి 0-12-0

గృహలక్ష్మి కార్యాలయము, రాయపేట :: మద్రాసు.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక


వ్యవస్థాపకులు

**డాక్టరు. కే. యన్. కేసరి**

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య



**సంపుటము ౨౨] సెప్టెంబరు 1953 [సంచిక ౯**

# విషయసూచిక




దావరీమ పరవళ్లు 457

మరజీవనం : వడ్డికృష్ణవేణిగారు. 459

కారుమారు: ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రిగారు 462

పెళ్ళెప్పుడుపాపా ? : కొమ్మూరి వేణుగోపాల రావుగారు 465

గృహిణి : అ. శకుంతలాబాయిగారు 471

స్వామినాధన్ : చీమలపాటి సూర్యనారాయణ గారు 474

నిస్పృహత : దొండపాటి రామమూర్తిగారు 480

పాకకళ 482

మారిన నళిని . నన్నపనేని మంగాదేవిగారు 483

ఆంధ్రజానపద గేయ వాఙ్మయచరిత్ర : టేకుమళ్ళ కామేశ్వరావుగారు 490

అనుమానం : వజ్ఝల లక్ష్మీనరసమ్మగారు 494

పింగళిసూరనగారి సుచిముఖి : మి. నరసింహులు గారు 498

స్వీకారము : వే. చం. 504

గృహవైద్యము 505

మనదేశభాషలకు 'నాగరలిపి' 506

'అవ్వయ్యార్' చిత్రసమీక్ష 508

వివిధ విషయాలు 509

సంపాదకీయములు 510

పంచాంగం 512




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## గోదావరీ మ పర వళ్లు



మానవ జీవతంలో పరవళ్లు సహజమయినవి. కాని అవి సమయానుకూలంగా, సంతోషకరంగాను, విషాదకరంగాను, భయంకరంగాను పరిణమించడముకలదు. కష్టాలు సుఖాలు ఎలాగ సహజమయినవో ప్రకృతి వాతావరణంలో ఏర్పడే మార్పులు - పరవళ్లు అనివార్యములు. ఇట్టిదే యీ మధ్య సంభవించిన గోదావరి వరదల ఫలితాలు.

ఈ గోదావరి వరదల స్వరూపము యీ మధ్య ఎప్పుడూ కనివిని ఎరుగని పరిణామములకు కారణమయింది. వేలు, లక్షలకొలది ప్రజలునిరాశ్రయులై, పశుపక్ష్యాదులతో బాటు యిళ్లు, వాకిళ్లు, ఆస్థిపాస్తులు, కొన్ని లక్షల యకరాల పంటభూమి నష్టపడి చేప పిల్లలలాగ ఆబాల గోపాలం కొన్ని రోజులపర్యంతము వరద నీళ్లలో తేలియాడారంటే వారి కష్టనష్టాలను ఊహించుటకూడ కష్టమేమో! ఇట్టి కష్టాలపాలైన ప్రజానీకపు — ముఖ్యంగా మహిళా లోకంయొక్క దైన్యావస్థ యావదాంధ్ర ప్రజా

నీకమునకేకాక యావద్భారత ప్రజానీకపు హృదయములను కరిగించుటలో విశేషము లేదు.

వరదలకు సంబంధించిన ఛాయాచిత్రాలను చూస్తున్నా, వరదల వృత్తాంతమును వింటున్నా భయరోమాంచదములు కలుగుతున్న మనకు స్వయంగా వరదల్లో బాధపడినవారిని తలచుకుంటే సహాయసానుభూతులుచూపి ముందుకురాని భారతీయుడుండడని మా విశ్వాసము. ఆ పత్సముద్రమునుండి ధైర్యసాహసములతో బయటపడిన ప్రజానీకానికి మా సానుభూతి, అభినందనలు తెలుపుతున్నాము.

ఈసమయంలో సహాయకార్యక్రమాన్ని నిర్వహిస్తున్న కేంద్రరాష్ట్రప్రభుత్వములు అభినందనీయములు. అంతకంటె రామకృష్ణమిషన్, జాతీయవైద్య కళాశాలలాంటి అనధికార సంస్థలు, వ్యక్తులు వరదబాధితుల సహాయార్థముచేయుచున్నకృషి అపారము, అమూల్యముకూడాను. వరదప్రాంత్యాలలో సాధారణ పరిస్థితులు ఏర్పడాలంటే ప్రభుత్వ సహాయసానుభూతులు, కార్యక్రమము మాత్రము చాలదు. ప్రజలే ముందంజవేసి తాము సర్వవిధాల వరదపీడిత ప్రజానీకానికి, ప్రాంత్యానికి సహాయపడాలి.

గోదావరి ప్రాంత్యమంటే ఆహార ధాన్యాల పంటకు పేరు ప్రఖ్యాతులు గడించినది. ఆహారములాంటి సమస్యల పరిష్కారానికి ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రానికి ఆ ప్రాంత్యము ఆయువుపట్టు కాబట్టి ఆ ప్రాంత్యము పూర్వపరిస్థితికివచ్చి సశ్యశ్యామలంగా కావడం యావదాంధ్ర దేశానికి వాంఛనీయం. అందుకు ప్రభుత్వ సహాయమూ ప్రజల సహాయమూ అత్యధికంగా కావలసియున్నది.





# అమర జీవనం

శ్రీమతి వడ్డి కృష్ణవేణి

సుసీల రామనాథంగారి ఏకైక పుత్రిక. నలుగురు మొగపిల్లల తర్వాత పుట్టింది సుసీల. గారాబంగా పెరిగింది. రామనాథంగారు పేరుమోసిన 'ప్లీడరు. నెలకు ఐదారువందలరాబడి ఉంటుంది. ఆయనకి స్త్రీవిద్యయందు చాలా నమ్మకం. కూతురికి స్కూలు ఫైనలుదాకా చెప్పించాడు. ఆమెకూడా చదువుకున్నానుగదా అని ఏమాత్రం గర్వంలేకుండా ఉండేది. పెద్దలయందు గౌరవం, వినయవిధేయతలు కలిగి ఉండేది. రామనాథంగారు ఇంకా చదువు చెపిఏంచాలనుకున్నారు. కాని, భార్యపట్టుదలవల్ల కూతురి వివాహం, ఆమె స్కూలు ఫైనలు ప్యాసయినయేడే చెయ్యవల్సివచ్చింది.

అల్లుడు మధ్యతరగతి కుటుంబీకుడు. అతని తల్లి తండ్రులు ఎల్లాగో కష్టపడి బి. యె. దాకా చదువు చెప్పించారు. మంచి ఆలోచనపరుడు. తెలివితేటలు అతని సొమ్ము. సుసీలను ఇచ్చి వివాహం చేసారు. సుసీల కాపురానికి వచ్చింది. 'మోహన్ బి. యే. ఫస్టుక్లాసులో ప్యాసయినాడన్నవార్త! ఆ రోజున తెలిసింది. వారి సంతోషమునకు మేరలేదు. మామగారుకూడా సంతోషించారు. మోహన్‌కు సంసార బాధ్యత నెత్తినపడ్డది. తల్లి, తండ్రులు పెద్దవారయ్యారు. మిగిలిన తమ్ముళ్లని, చెల్లెళ్ళని, చూడవల్సి వచ్చింది. ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాడు. ఈ కరువు రోజుల్లో బి. యె. ప్యాసయితే మాత్రం ప్రయోజనమేమిటి? గుమస్తాపని దొరకటంకూడా, దుర్లభమైపోయింది. అల్లుడి అవస్థ చూడలేక మామగారు కూతుర్ని, అల్లుణ్ణి తమ యింటికి రమ్మని ఆహ్వానించాడు. మోహన్ "భార్యను పుట్టింటికి వెళ్ళమని, తనకు ఉద్యోగం దొరికిన తర్వాత తీసుకొని వస్తానని, తనతో తిండికికూడా కరువువాచిన సుసీలను పుట్టింటికివెళ్లి కొన్నిదినాలుండమని" భర్త బలవంతపెట్టాడు. సుసీలపేరుకు తగ్గగుణములు కలది. "మంచి అయినా, చెడ్డ అయినా, హిందూ స్త్రీ

భర్తయే దైవమనినమ్మి అతని కష్టసుఖములు సమానముగా పంచుకొనవలెనుగాని, దురదృష్టమువల్ల భర్త కొద్దిరోజులు సంపాదించక పోయినంత మాత్రాన పుట్టింటికి పొమ్మంటారా? ఎన్ని కష్టములుపడినను, మీతోవున్న ఆనందం, పుట్టింట్లో ఎంత సుఖంగా వుంటేమాత్రం వుంటుందా" అని భర్తను సమాధానపరిచింది. తండ్రికి "ఎప్పుడూ తనని రమ్మని వుత్తరం వ్రాయవద్దని వున్నదాంతోనే తృప్తిపడి అత్తగారియింట్లో వుంటానుగాని, పుట్టింటికిరానని" ఖండితంగా చెప్పింది. రామనాథంగారు కూతురి ఆలోచనా జ్ఞానానికి లోలోన సంతోషించాడు. ఇటువంటి కూతురు ఒక్కతెవున్నాచాలు పేరు ప్రతిష్టలు రావటానికి? ఈ విధంగా కొన్ని రోజులు గడిచినవి.

మోహన్‌కు అతికష్టంమీద గుమాస్తాపని దొరికింది. నెలకు 80 రూపాయల జీతము. ఆరాబడితోనే తమ్ములకు జీతంకట్టి చదువు చెప్పిస్తున్నాడు. మిగిలిన డబ్బుతో సంసారం గడవాలి. సుసీల భర్త తెచ్చిన కొద్ది జీతముతోనే ఇంట్లో ఆనందంగా గడిపేది. ముందు అత్త, మామలను జాగ్రత్తగాచూచి వారికి కడుపునిండాపెట్టి మిగిలినది పిల్లలకు, భర్తకు



పెట్టేది. తను మిగిలినరోజు తినటం, లేనిరోజు పస్తులు పడుకోటం! ఈ విషయం ఇంట్లో ఎవ్వరికి తెలిసేదికాదు. పైకి మాత్రం తల దువ్వుకొని, చీర కట్టుకొని శుభ్రంగా ఉండేది. భర్త పగలంతయు ఆఫీసు చాకిరీచేసి అలసి ఇంటికి వచ్చేటప్పటికి శ్రమంతయు మరిచిపోవునట్లు చేస్తూ ఉండేది. ఈలేని పరిస్థితికి ఇటువంటికోడలు దొరకటంకూడా పూర్వజన్మ పుణ్యమేనని మురిసిపోయేవారు ఆ వృద్ధ దంపతులు. ఒక రోజున మోహన్ భోజనంచేసి ఆఫీసులో చేయగా మిగిలిన కాగితాలు ఇంటి దగ్గరికితెచ్చి పని చేసుకుంటున్నాడు. వంట యింట్లో గిన్నెల చప్పుడు విని అప్పుడే సుసీల భోజనం అయిందా అని లోపలికి వెళ్ళిచూచి నిర్ఘాంతపోయాడు. అన్నీ ఖాళీ గిన్నెలే! సుసీల అన్నంతిన్నజాడ కనుపించలేదు. ఒక గ్లాసులో కొద్దిగా నీళ్ళ మజ్జిగ పుచ్చుకొని త్రాగుచున్న సుసీలను చూచాడు. "ఎన్నిరోజులని పస్తులుంటావు? వున్నదాంట్లోనే ఇద్దరం సమానంగా తినాలిగాని, వున్నదంతా మాకుపెట్టి నీవు ఈ మజ్జిగతో ఎన్ని రోజులు గడుపగలవు. ఏదయినా జబ్బుచేస్తే ఇంట్లో చూసేవాళ్ళెవరున్నారుచెప్పు" అని అడిగాడు. "నేను రోజూ భోజనం చేయటంలేదని ఎవరు చెప్పారు. ఈ రోజున ఆకలిలేనందున తినలేదుకాని రోజు ఎందుకు మానుకుంటా"నని ఏవో మాటలుచెప్పి భర్తను సమాధానపరిచింది. కానీ! మోహన్ ఆమె మాటలు పూర్తిగా నమ్మలేకపోయాడు.

ఆ రోజు ఆదివారం. మోహన్ ఆఫీసుకు శలవగుట వల్ల ఇంటిదగ్గరనే వున్నాడు. అప్పుడే భోజనం చేసి గదిలో మంచంమీద నడుమువాల్చాడు. సుసీల ఇంట్లో ఏదో పనిచేసుకుంటున్నది. ఇరుగు పొరుగు వారు వారియింటికి వచ్చారు. పిచ్చాపాటి మాట్లాడిన తర్వాత, సుశీలను చూచి, "ఏమమ్మా రోజు రోజుకు మరీచిక్కిపోతున్నావు. కాపురానికి వచ్చినప్పుడెల్లాగున్నావు, ఇప్పుడెల్ల గున్నావు ఆనమాలు పట్టలేకుండావున్నావే? అప్పుడే చిక్కక ఏముంది. వేళకు తిండా నిద్రా, అస్తమానం ఇంట్లో చాకిరీ

చెయ్యాలి! సరి అయిన తిండిలేకపోతే ఎట్లా వుంటావులే! పాపం! కొద్ది రోజులు మీవాళ్ళ ఇంటిదగ్గిర ఉండి రాకూడదా అమ్మా? మీ ఆయన తెచ్చేజీతం, మీ యిద్దరికీ అయితే హాయిగా సరిపోయేదే! ఈ సంసారాన్ని అంతా పోషించాల్సి వచ్చిందాయె ఏమోలే అంతా ఖర్మ. పుట్టింటిదగ్గిర ఎంతగారాబంగా పెంచారో, ఇక్కడ అంత కష్టపడుతున్నావు." అని సానుభూతి చూపింది. కాని ఈ మాటలు సుశీల మనసును బాధపెట్టాయి. "పిన్నిగారూ! మీరు పెద్దవారు. మీకు నేను చెప్పదగిన దానిని కాదు. కానీ అన్నీ తెలిసిన మీవంటి పెద్దవారు అనవల్సిన మాటలు ఇవేనా? చిన్నవాళ్లు తెలియక ఏదయినా తప్పుచేస్తే బుద్ధి చెప్పవల్సిన మీరే అత్తగారియింట్లో సుఖంగా లేదని, అత్తమామలను పోషించాల్సివచ్చిందని, పుట్టింటికి వెళ్లి ఉండమన్నారా? కన్నపిల్లలను పెంచి పెద్దచేసి వారికి విద్యాబుద్ధులు చెప్పించి వృద్ధిలోకి తెచ్చి మన శ్రేయస్సుకోరి మన ఆనందమే వారి ఆనందముగా చూచి మురిసిపోయే తల్లి తండ్రులను పోషించవలసిన బాధ్యత ఏకొడుకునకు వుండదు? ఇక తమ్ముల విషయం అంటారా? అజ్ఞానంలోవున్న వారిని వృద్ధిలోనికి తీసుకొని వచ్చి, వారి జీవితాన్ని వారు పోషించుకోగలిగిన, శక్తివంతులుగా చేయవల్సిన బాధ్యత మనయందేవున్నది. వారందరి తర్వాత నేకదా నేను? ఇంత చదివికూడా భర్త ఎక్కువ సంపాదించలేకపోతున్నాడని అనుకొనుటకు 'స్త్రీ చిత్తం పురుషుడి భాగ్యం' అన్నట్టు వారి సంపాదనకూడా మన అదృష్టమే! పుట్టింటి దగ్గిర గారాబంగా పెరుగుటకు వారికి వున్నది కనుక వారివిధి ఎంతవరకువున్నదో వారు నెరవేర్చారు: అక్కడ సుఖంగా పెరిగాం కనుక ఇక్కడకూడా సుఖంగానే వుండాలి అనడం చాలా తెలివి తక్కువ. చిన్నప్పుడు పుట్టింట్లో సుఖంగావున్నా, కష్టంగావున్నా మనకు తెలియని అజ్ఞానదశ. ప్రతిభారత స్త్రీకి అత్తగారి యింట్లో ఏరకంగా వుండవల్సిన రోజు అల్లా వుండగలిగినరోజే ఆ భార్యా, భర్తలు అనుకూలమయిన దాంపత్యముతో ఆనందంగా జీవించగలరు. అంతేకాని! చిన్నప్పుడు ఎంతో బాగా పెరిగాం ఇప్పుడు కష్టపడుతున్నాం మన ఖర్మకొద్ది దొరికాడు ఈ భర్త అని దూషించి పుట్టింటికి వెళ్ళటం ఏమంత తెలివిగలపని? స్త్రీకి ఎంత కోపిష్టి భర్త అయినా అతని దగ్గిరవున్న స్వతంత్రం ఎంత మంచివారయినా పుట్టింట్లో వుంటుందా! కాబట్టి పిన్నిగారు! ఎప్పుడూ స్త్రీ ఆపదవచ్చినా, సంపదవచ్చినా అత్తగారింట వుండాలి! అదే వారి జీవితాంతమువరకు నాది అని చెప్పుకోదగినది" అంది. భార్య చెప్పిన ప్రతి మాటకు లోలోన సంతోషించాడు మోహన్. ఇటువంటి భార్య దొరకటం ఎంతటివారికో అని గర్వంచాడు. భారత దేశంలో ఇటువంటి స్త్రీలు ఎక్కడో ఒకరు ఉండబట్టే ప్రపంచకం ఈలాగయినా ఉందనుకున్నాడు. అత్తగారు ఆశ్చర్యపోయింది. సుశీల మాటలువిన్న ఆ పొరుగింటి యిల్లాలు "అమ్మా! సుశీలా! నీవు వయసుకు చిన్నదానివయినా నిజంగా చాలా అనుభవం కలవాళ్లు చెప్పినట్లు చెపుతున్నావమ్మా, ఇన్ని ఏళ్లువచ్చికూడా కష్టంవచ్చినరోజు మేము విసుక్కుంటూనే వుంటాం. నీకింత ఓర్పు ఎల్లా వచ్చిందమ్మా. నిన్ను చేసుకున్న మోహను ఎంత అదృష్టవంతుడోకదా! 'అనుకూల దాంపత్యమంటే మీదే'నమ్మా. నీ మనస్సు తెలిసికొనక నీకు బాధకలిగించాను. చాలా మంచి విషయాలు చెప్పావమ్మా. ప్రతి హిందూ స్త్రీ ఈ విషయములు తెలుసుకోతగినవి. ప్రతి గృహంలో భార్యా, భర్తలు అనుకూలంగా, ఆనందంగా కాలము గడపాలంటే స్త్రీ సుశీల గుణములు నేర్చుకున్ననాడే లోకంలో అమరజీవనం గడుపగలరు. వెళ్లివస్తానమ్మా చాలా సేపయింద"ని ఆ యిల్లాలు వెళ్లిపోయింది. అత్త, మామలు, భర్త, సుశీలయొక్క తెలివికి సంతోషించారు. ఊరివారందరు అనుకూల దాంపత్యమంటే సుశీలా మోహనులదేనని వేనోళ్ళ పొగడుతుండేవారు. చదువుకున్న స్త్రీ చెప్పినమాట వినదని కొందరి మూఢనమ్మకము. సుశీల మాత్రం చదువుకొనలేదా? ఆమె తన చదువును ఏవిధంగా వినియోగించిందో ప్రతి స్త్రీ గుర్తించాలి.

# తారుమారు!

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

తీరా వాకిట్లోకి వెళ్ళేటప్పటికి తలుపు శాస్త్ర తాళం వేసివుంది. రామనాథం కళ్ళుమన్నాడు తల్లిమీద. శాంతమ్మకు యెటూ మాట్లాడటానికి తోచలేదు. శారద మాత్రం అతితీవ్రంగా ఆలోచిస్తోంది. ఎండమాడ్చేస్తోంది పదిగంటలకే. నిండు వేసంగిలో ముహూర్తం కుదిరింది పెళ్లి కూతుర్ని చూడటానికి.

ఎన్ని సంబంధాలువచ్చినా రామనాథానికి మాత్రం ఒకటే సమాధానం తటుతూ వచ్చింది. చదువు పూర్తికానిదే పెళ్లి చేసుకోనంటూ. ఆ అడ్డం తీరిపోగానే తల్లి శాస్త్ర పీకెమీద కూర్చుంది, ఎవరినో వకర్ని కట్టుకోమంటూ. కందకులేని దురద కత్తి పీటకు యెందుకో! రామనాథం శాస్త్ర సమాధానం వెతుక్కోటంవరకు వచ్చే టప్పటికి శాంతమ్మకు మంచి అవకాశం దొరికింది. శారద మాత్రం అన్నయ్యతో పాటు సంబంధాలు చూడటానికి వెళ్ళాలనే సరదాలోనేవుంది. ఇక రామనాథానికి యిల్లు కదలటం తప్పనిసరి అయింది.

మగవాడు తనకేమని అతనిధీమ. చదువుకున్న ఆడదాన్ని చేసుకోవాలనే నవీన మోజు అతన్నికూడా పట్టుకు పీడించవట్టే యెన్నో సంబంధాలకు స్వస్తిచెప్పి యీనాడు యీ పట్ట భద్రురాల్ని చూడటానికి వచ్చాడు. అడుగులోనే హంసపాద మన్నట్లు తీరా వాకిట్లోకి వెళ్ళేటప్పటికి తలుపు శాస్త్ర తాళంవేసివుంది.

కింకర్తవ్యం అనే ప్రశ్న యీ ముగ్గుర్ని అయిదు నిమిషాలవరకు మౌనంలో ముంచేసింది. 'ఇరుగుపొరుగు అంటారు. శాస్త్ర ప్రక్కింటి వాళ్లింటికివెళ్లి అడుగుదాంరా. ఈ శాస్త్రలో మనగౌరవానికి యేమీలోటు రాదులే నాయనా' అన్నది శాంతమ్మ. శారద ముఖం చిటచిటలాడించింది. రామనాథం అక్కసుపట్టలేకపోతున్నాడు.

'మనం సంబంధము చూడటానికి వచ్చామని మాత్రం వాళ్లతో చెప్పక్కర్లేదు' అంటూ యేసవరణ లేకుండానే ఒక తీర్మానం చేసుకుని అవతల యింటివైపుకు కాలు కదిపారు. శారద మాత్రం 'యెవరని అడుగుతే ఏంచెప్పుదాం' అన్నది అతి భయంగా.

ఏదో చెప్పుదాంలే అంటూ ఒక్క విదిలింపు విదిలించేశాడు రామనాథం. శారద వుక్కిరి బిక్కిరి అయింది. శాంతమ్మ రామనాథంవైపుకు చూసింది.

ఈ క్రొత్త ముఖాలన్ని చూసేటప్పటికి రంగారావు ప్రాణం నిలువునా యెగిరి పోయింది. అపరాహ్ణంవేళ అనాయాచితంగా అతిథులువస్తే అన్నంపెట్టాలనే ఆవేదనకంటె అతనిలో యింకేంలేదు. రంగమ్మ రండి లోపలకు అంటూ ఆదరించింది.

మగవాడు మొద్దులాగ కుర్చీలో కూర్చునివుంటే ఆడది రమ్మని ఆహ్వానించటం అనేది రామనాథానికి చాల కటువనిపించింది. శాంతమ్మ, శారదలు మాత్రం ఏభావం లేకుండానే చేటంత ముఖం చేసుకుని లోపలకు వెళ్ళారు.

రామనాథానికి తనను తానే పరిచయం చేసుకోవటం యిదే ప్రథమం.

'కామేశ్వరరావుగారు మా బంధువు. వారింటికి వచ్చాము. కాని ... అంటూ యేదో టూకీగా ప్రారంభించాడు. శాంతమ్మ ముసిముసి నవ్వులు శారద పళ్లికిలించటం కొంతవరకు రంగమ్మ చూసిందేమోనని రామనాథం కొంచెం భయపడ్డాడు.

'ముందర భోజనాలు కానీండి. తర్వాత మాట్లాడుకోవచ్చు!' అంటూ రంగారావు హఠాత్తుగా వాకిట్లోకివచ్చాడు. ఆయనకు ఆదరణ చాలా ఎక్కువ. ఆ సమయానికి వచ్చినవాళ్లకు భోజనాలు పెట్టాలనేదే ఆయన సిద్ధాంతం. ఎవరూకూడా కాదని గెలవలేదు.

తాపీగా సావిట్లో కూర్చున్నారు. బాతాఖానీ మహోత్సవానికి రంగమ్మ ప్రారంభోత్సవము చేసింది.

'వియ్యాలవారిల్లు యిదేలాగవుంది.వచ్చినందుకు యీ అమ్మాయి సంగతి యేదైనా తేల్చుకుంటేరామనాథాన్ని ఒకయింటివాన్ని చేసినవాళ్లం అవుతాం' అనుకుంది. లోపల దూరంగా గదిలో వోరవాకిలిగావున్న తలుపు ప్రక్కనుంచి తొంగిచూస్తున్న ఒక అమ్మాయినిచూసి శాంతమ్మ.

రామనాథం యింట్లో అడుగు పెట్టంగానే చూసింది.

ఆ అమ్మాయినే!

...'ఇట్లా వుందండి మా పరిస్థితి. ఈ కట్నాల రోజుల్లో యీ అమ్మాయికి ఆ మూడుముళ్లు యెట్లా పడతాయో-సామాన్య కుటుంబీకులం' అంటూ రాత్రింబగళ్లు ఒకటే మథనపడిపోతున్నాం అన్నది రంగమ్మ.

రామనాథం మనస్సులో యేమిదూరిందో భగవంతునికెరుక. 'ఏమన్నా చదువుకున్నదా అండి' అన్నాడు రామనాథం, నదురుబెదురు లేకుండా. అట్లా అడగటం శాంతమ్మకు చాలా ఆశ్చర్యంవేసింది.

రంగారావు కూతురి సంబంధం విషయము యెవరు చర్చించుకున్నా అక్కడ హాజరు అవుతూ వుంటాడు. ఆయనకు

ఆ అమ్మాయిపెళ్లి యెట్లా చేస్తానా అనే ఆదుర్దాయే యెక్కువవుతున్నా తన ఆస్తి అంతా వచ్చేపోయెవాళ్లకు విస్తళ్లు వెయ్యటంతోనే అయిపోతోంది.

'చదువుకోక పోవటమేమిటి? ప్రయివేటుగా ఇంటర్మీడియట్ చదువుతోంది. మా అమ్మాయి ఫస్టుక్లాసులో మెట్రిక్యులేషన్ ప్యాసయింది' అంటూ గదిలోకి వెళ్లి సర్టిఫికెట్టు తీసుకువచ్చాడు. ఆయన యితరుల చదువుల గురించి సర్టిఫికెట్టు చూడనిదే నమ్మడు.

రామనాథం ఏవో యింకా వివరాలు రంగారావును అడుగుతుంటే శాంతమ్మ, రంగమ్మ ప్రశ్నలకు సమాధానాలు చెపుతోంది. శారదకు మాత్రం యేమీ తోచటంలేదు.

'అమ్మా'! వాళ్లు యెప్పుడు వస్తారనిమనం అడుగుతాము' అన్నది మెల్లిగా తల్లితో శారద.

శాంతమ్మ, 'ఏమండీ'! అంటూ యేదో అడగబోతుంటే రామనాథం అందుకుని, ఈ కామేశ్వరరావుగారు యెప్పుడు వస్తారండీ' అన్నాడు. రంగారావు యేదో సమాధానం చెప్పబోతుంటే రంగమ్మ అందుకుని 'వాళ్ల అమ్మాయి వరున్ని చూడటానికి వెళ్లింది. ఎవరో వెంకట్రామయ్యగారి అబ్బాయిట, బాగా చదువుకున్నవాడుట. ఆ అబ్బాయి చదువుకున్న పిల్లనే చేసుకుంటానని ఒక దీక్ష పట్టాడుట. ఆ అబ్బాయివచ్చి నన్ను చూసేదేమిటి? నేనే వెళ్లి ఆ అబ్బాయిని చూసివస్తాను అంటూ బయలుదేరింది ఆ సుజాత. ఆ అమ్మాయి మహా ... 'అని నాలిక కరుచుకుని సగంలో ఆపేసింది.

శాంతమ్మ గుడ్లు పెద్దవిచేసింది. శారద ఆశ్చర్యంగా చూసింది.

రామనాథం ఎదురుకుండావున్న గదివైపుకుచూస్తూ చిరునవ్వుతో ఏంఫరవాలేదన్నట్లు తలవూపాడు.

రంగారావు అర్థంచేసుకున్నట్లు రంగమ్మవైపుకు చూశాడు.



# నీ వెళ్ళెప్పుడు పాపా?

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

[విశ్వపతి ఒంటరిగాడు. బిడ్డలు పాపలులేరు. ఆ యింట్లో నౌకరు కేశవులుతో అతను కనుపిస్తుండేవాడు. రమామణితో పరిచయము ఏర్పడిన నాటినుండి అతనిలో నూతన ఉత్సాహం, అణగారి పోయిందేమోననుకుంటుండిన ఆనందం చిగిర్చినవి. రమామణి ప్రతి దినం బడికి పోతూ దారిలోనున్న విశ్వపతి యింటికి వెళ్లి కొంతకాలం గడిపి పోవడం అతనికెంతో ఆనందంగానుండేది. రమామణికి ప్రతిదినం బిస్కట్లు, తినుబండారాలు తెచ్చి బలవంతంగా యిచ్చి పంపడంతో పాటు చినిగినదుస్తులతో నున్నప్పుడు దుస్తులు కూడ కొని తెచ్చియిచ్చేవాడు ఒక రోజున రమామణి వద్దన్నా తాను తెచ్చిన బంగారు గొలుసును మెళ్లోవేసి యింటికి పంపించాడు. ఆ నాటినుండి రమామణి విశ్వపతి యింటికి రావడముకాని, కంటికి కనుపించడము కాని నిలిచి పోయింది. దాంతో విశ్వపతికి ఆందోళన అధికమయి రమామణి యింటికి వెళ్లి మంచముమీద జ్వరముతో పండుకొని యున్న రమామణిని చూచాడు – యికచదువండి]

(గతసంచిక తరువాయి)

ఆమె చెంపలమీద చెయ్యివేసి నిమురుతూ "జ్వరంవచ్చిందా మణీ!" అన్నాడు ఆప్యాయంగా విశ్వపతి.

అంతలో వెనక అడుగుల చప్పుడువినిపించింది. చటుక్కున తలత్రిప్పి చూశాడు విశ్వపతి. ఒక ముప్ఫయిఏళ్ల ఆమె నిలబడివుంది. విశ్వపతికి తను చేసిన సాహసకార్యం గుర్తువచ్చింది, తను ఎంత అసభ్యంగా ప్రవర్తించిందీ తలంచుకుని లేచి నిలబడ్డాడు తలవంచుకుని.

"పర్వాలేదు. కూచోండి." అంది ఆమె.

"నేను యింతచనువుగా ప్రవర్తించినందుకు, క్షమించండి." అని తిరిగికూర్చున్నాడు విశ్వపతి. ఒక నిమిషంవరకూ ఎవరూ మాట్లాడలేకపోయారు.

"అమ్మాయికి జ్వరం వచ్చిందా?"

"అవును. మీరుచేసిన పనివల్లనే అదియీస్థితికి వచ్చింది" అన్నదామె.

"నేనా?" అంటూ విస్తుపోయాడు విశ్వపతి.

"అవును"

"మీరు మణి తల్లిగారనుకుంటాను."

"అవును"

"నేను చేసిన పనివల్లనే ఆమెకీ స్థితి సంభవించిందన్నారు. అదేలాగో తెలుసుకోవచ్చా?" అని వినయంగా ప్రశ్నించాడు విశ్వపతి.

"మీరు అంత విలువగల గొలుసు దానికెందు కిచ్చారు? అది చూసి వాళ్ల నాన్నగారు మండి పడ్డారు..." అని మణి తల్లి యింకేమో చెప్ప బోయింది.

"నేను వేరే ఉద్దేశంచేత యివ్వలేదే! మణి మీది ప్రేమచేత" అన్నాడు విశ్వపతి ఆమెను ఆపి.

"నిజమే - మేమూ అందుచేతనే యిన్నాళ్లూ వూరుకున్నాము. మీరు దానికి రోజూ ఏదో ఒకటి యిచ్చి పంపుతున్నా వద్దంటే మీ మనస్సు కష్ట పడ్తుందేమోనని ఏమీ అభ్యంతరం చెప్పలేదు. ఆవేళ పట్టుగౌను యిచ్చినప్పుడుకూడా ఆయన మండి పడ్డారు. మీవద్దకు వచ్చి యీవిషయం గట్టిగా అడుగుతానన్నారు; కాని - ఆయనకు పిల్లలంటే ప్రేమ వుండి వుంటుంది. అందుచేతనే యిచ్చి వుంటారు. అనవసరంగా తొందరపడబోకండి" అని నేనే ఆయన్ని ఆపాను.

మణి తల్లి చెప్పుకుపోతూంది. విశ్వపతి తలవంచుకుని వింటున్నాడు.

అంతలో మణి కళ్లుతెరిచింది. విశ్వపతి ఆ పిల్ల వంక చూసి "పాపా! ఎలావుంది?" అనడిగాడు.

"బా... బా... యి" అన్నదిమణి. విశ్వపతి ఆమెవంక ఆత్రంగా చూచాడు. తిరిగి మణి కళ్లు మూసుకుపోయాయి.

"తర్వాత మీరు నిన్న ఆ గొలుసు యిచ్చి నప్పుడుకూడా యిటువంటి రభసే జరిగింది. మణిని వెంటనే యిచ్చేసి రమ్మన్నారు. అదెంతయినా చిన్నపిల్ల. ఇవ్వనని మొండిపట్టుపట్టింది. వాళ్ల నాన్నగారు కోపంచేత దాన్ని చావగొట్టారు. పసి పిల్ల ఏంతట్టుకోగలదు? సాయంత్రానికల్లా నూట మూడు జ్వరం. ఆయన యింతవరకూ పిల్లమీద చెయ్యిచేసుకుని ఎరుగరు; తర్వాత ఎంతగానో బాధ పడ్డారు. ఇదంతా ఎందుకని చెప్తున్నానంటే మీకు ఏ కారణంచేతనయినా ప్రేమవుండవచ్చు. అందుకని అటువంటి విలువగల వాటిని చీటికీ మాటికీయిస్తూ వుండటం ఆయనకేమీ యిష్టంలేదు. ఇక ముందెప్పుడూ అలాచేయరని నా నమ్మకం" అంటూమణి తల్లి గిరుక్కున లోపలకు వెళ్లిపోయింది.

విశ్వపతి ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. తను నిజంగా అపరాధంచేశాడా? తనలో వాత్సల్యం వుంటే వుండవచ్చు. ఆ వాత్సల్యాన్ని దాచుకో లేక ఏదయినా యివ్వటం తప్పా?

మణి తల్లి గదిలోకి వచ్చింది మళ్లీ. విశ్వపతి ఆమె వంక చూశాడు. "ఇదిగో మీరు యిచ్చిన గొలుసు. యిలా ప్రవర్తిస్తున్నానని ఏమీకష్టం పెట్టుకోకండి. ఏంచెయ్యగలను? విధిగా యిలా అనవల్సివస్తుంది" అంటూ దానిని అందించింది. విశ్వపతి లేచి నిల్చుని అందుకున్నాడు.

"నాప్రవర్తనవల్ల మీకు కష్టం కలిగితే క్షమించండి. మణిని నాకుమార్తెగా భావించుకున్నాను. మీరు ఏమీ అనుకోరని యిలా చేశానుగాని దానికి ఫలితం యిలా అవుతుందని వూహించుకోలేక పోయాను. మీవారువస్తే నా క్షమాపణలు చెప్పండి" అని మణివంక ఒకసారిచూసి బయటకు వచ్చేశాడు.

మణితల్లి శూన్యంలోకిచూస్తూ నిల్చుండిపోయింది.

◆ ◆ ◆

వారంరోజులు గడిచాయి. విశ్వపతి ఆలోచనలతో సతమతమయిపోతున్నాడు. తను, ఏ కాకీ ఈప్రపంచంలో "నా" అని చెప్పుకోదగ్గవారు ఎవరూలేరు. తనింక ఎవరికోసం బ్రతకాలి. మొరటు

బారిపోతున్న తన జీవితంలో మణి ప్రవేశించిన తర్వాత తిరిగి ఆశ చిగిర్చింది కాని అది మూన్నాళ్ల ముచ్చట.

ఆ రోజు విశ్వపతి కాఫీతాగి సావిట్లో కూచున్నాడు. ఉదయం ఏడుగంటలయింది. తను వారంరోజుల్నుంచీ బయటకి రావటంలేదు. మణికి జ్వరం తగ్గిందా? రోజూ బడికిపోతూంద్రేమో! తను చూడటంలేదు. ఇవేళ కనిపిస్తే? ...

దూరంగా మణి కనిపించింది. విశ్వపతికి కొంచం కంగారు పుట్టింది. లేచి లోపలకి పోదామనుకున్నాడు. అయినా కదల్లేకపోయాడు.

రమామణి దగ్గర కొచ్చింది. విశ్వపతి బలవంతంగా తలతిప్పుకున్నాడు. మణి యితని దగ్గరకే నడిచివచ్చింది.

"బాబాయ్"

విశ్వపతికి అటుచూడక తప్పలేదు. మణి యితని వంకేచూస్తూ నిలబడివుంది. జ్వరంవల్లనేమో మనిషి నీరసించిపోయింది.

"జ్వరం తగ్గిందా పాపా?"

"ఊఁ"

విశ్వపతికి వాత్సల్యం పెల్లుబికింది. అయినా బలవంతంమీద అణుచుకుంటూ "నామూలంగా నీకు దెబ్బలు తగిలినయిటగా పాపా?" అనడిగాడు.

"మా నాన్నగారు నన్నూరికినే కొట్టారు"

"మీ యింట్లో ఏమన్నారుపాపా? నాగురించి?"

మణి ఆశ్చర్యంగా చూసింది. "ఏమీఅనలేదు. ఆ గొలుసు యిచ్చేశానని చెప్పిందమ్మ" అన్నది.

విశ్వపతి అనలేక అన్నాడు "మణీ యిక ముందు యిక్కడకి రావద్దమ్మా. మీ నాన్నగారికి కోపం వస్తుంది. పెద్దవాళ్లకి కోపమొచ్చే పనులు చెయ్యకూడదుగా. ఏం?"

"మా నాన్నగారి కెందుకు బాబాయ్ కోపం?" అనడిగింది మణి అమాయకంగా.

"ఏమోనమ్మా అది నాకేం తెలుసు? మరి రేపటి నుంచీ రావుగా" మణి మనస్సు ఎంత బాధ పడుతుందో అని తను బాధపడుతూ అన్నాడు.

"రానులే బాబాయ్. నాన్నగారుకూడా వద్దన్నారు."

ఇందాక చెప్పనిమాట యిప్పుడు చెప్పింది.

"నీకు జ్వరం పూర్తిగా తగ్గిపోయిందా పాపా?" అన్నాడు సంభాషణపూర్తి విశ్వపతి.

"ఊఁ. నేనివాళే బడికిపోతున్నా"

"అయితే త్వరగా వెళ్ళమ్మా. టైమయిపోయినట్లుంది."

మణి మెల్లిగా వెళ్లిపోయింది. విశ్వపతి హృదయం కలతలో మునిగిపోయింది. ఆమె వెళ్ళినదిక్కే చూస్తూ చాలాసేపు వుండిపోయాడు. తర్వాత భారంగా లేచి యింట్లోకి పోయాడు.

రోజులు గడుస్తున్నాయి. విశ్వపతి పూర్తిగా మారిపోయాడు. ఎప్పుడూ ఏదో దిగులు అతన్ని ఆవహించి వుండేది. ఏదో ఆలోచిస్తూనే వుండేవాడు ఎప్పుడుచూసినా. అతని ముఖంలో నిస్పృహ స్పష్టంగా కనబడేది.

రోజూ మణివచ్చేవేళకి సావిట్లో కూచుండేవాడు. మణి బడికిపోతూ యితనివంక చూసేది. ఇతను కూడా ఆ పిల్లవయిపు అప్రయత్నంగా చూసేవాడు. వెంటనే యిద్దరూ వారి చూపులు మరల్చుకునేవారు. ఆ తర్వాత ఒక్కసారయినా యిద్దరూ మాట్లాడుకోలేదు. కాని రోజూ ఉదయాన ఆ పిల్లవచ్చేవేళకి విశ్వపతి అక్కడ వుండకుండా వుండలేకపోయేవాడు.

అప్పుడప్పుడూ మణిని చూడగానే విశ్వపతి పెదవులు అప్రయత్నంగా కదిలేవి. "నీ పెళ్లెప్పుడు పాపా?" అనేమాట అతని పెదవులుదాటి బయటకురాబోయి తిరిగి ఆగిపోయేది.

ఒకొక్కొక్కసారి ఆ గొలుసు తీసుకుని దానివంక చూస్తూ నిశ్చలంగావుండిపోయేవాడు. ఇంకోసారి

తన పెట్టెలోవున్న ఏదో ఫోటోతీసి హృదయానికి హత్తుకుని గంటలకొద్దీ మైమరచి పోయేవాడు.

ఈ విధంగా అతనికి రోజులు భారంగా గడుస్తున్నాయి.

♦ ♦ ♦

"మణి వెళ్లిట బాబూ!"

రెండు సంవత్సరాల తర్వాత ఒకనాటి సాయంత్రం కేశవులు విశ్వపతితో అన్న మాటలివి.

మణి యీ రెండు సంవత్సరాలనుంచీ బడికి పోతూనేవుంది. సెలవురోజులనాడుతప్ప ప్రతి రోజూ విశ్వపతికి కనిపిస్తూనేవుంది.

పదిరోజులనుంచి మాత్రం మణి రావటంలేదు. ఎంత వద్దనుకున్నా విశ్వపతి ఆతృత పట్టలేక పోయాడు. మణికేమయిందో అని అతని హృదయం తహతహలాడింది. కేశవుల్ని పిలిచి అవతలవాళ్లెవరికీ కష్టంకలగకుండా యీ విషయం అడిగిరమ్మని పంపించాడు. అతను వాకబుచేసి వచ్చిచెప్పిన మాట యిదీ.

విశ్వపతి అయిదు నిమిషాలవరకూ స్తబ్దుడయిపోయాడు. "ఈ విషయం ఎవర్నడిగి తెలుసుకున్నావు?" అనడిగాడు తర్వాత.

"వాళ్లింటిప్రక్క ప్లీడరుగారింట్లో పనిచేసే వంటవాడు నాకు స్నేహితుడే. అతన్నడిగి తెలుసుకున్నాను యీ విషయం" అన్నాడు కేశవులు.

"ఎప్పుడట పెళ్లి?"

"ఇంకో పదిరోజులు వుందిట బాబుగారూ! అందుకని మణిని బడిమాన్పించేశారు"

"ఊహు" అని "సరే నువ్వెళ్లు" అన్నాడు విశ్వపతి. కేశవులు పోబోయాడు.

కాని మళ్లీ వెంటనే యజమాని అతన్ని ఆపి "ఉండు ఈ విషయం అడిగావా? మణి పెళ్లి ఎవరితో చేస్తున్నారట?" అని అడిగాడు.

"పేరు తెలియదుకాని బాబూ ఆయనెవరో మొదటిభార్య చనిపోయిందిట వయస్సు నలభయి అయిదుకు తక్కువ వుండదని చెప్పాడు."

"రెండవపెళ్ళివాడికి యిస్తున్నారా?" అంటూ ఆశ్చర్యపోయాడు విశ్వపతి.

"ఊ అవునట" "అలా ఎందుక"ని అడిగితే "డబ్బులేనివాళ్ళకి అంతకంటే మంచి సంబంధాలు వస్తాయేమిటి?" అన్నాడు. "నిజమంతేబాబూ" అన్నాడు కేశవులు.

తర్వాత అతన్ని పంపివేసి ఆలోచనలోపడ్డాడు విశ్వపతి. మణిని రెండవ పెళ్లివాడికి యిస్తున్నారా? ఆమె జీవితం యిక నాశనమయిపోవల్సిందేగా. పన్నెండేళ్ళపిల్లకి అంతకు నాలుగురెట్లు వయస్సుగలవాడికియిచ్చి పెళ్ళిచెయ్యటమా? ఎంత ఘోరం?

ఘోరం! ఏదిఘోరంకాదు? జరిగిపోయినవి తను తలుచుకోకూడదు. తలుచుకుంటే తను బ్రతకలేడు. ఎందుకూ తనింకా బ్రతకటం? ఏంచూసుకుని? తనకేమయినా అప్పులున్నారా ఎవరయినా? తనను చూసి జాలిపడే వాళ్లున్నారా? తనకెవరూలేని యీ ప్రపంచంలో బ్రతకాలని యింకా ఎందుకూ తాపత్రయం?

మణి పెళ్లి ఆపేదెట్లా? ఆ పెద్దవాడితో యీ చిన్న పిల్లకు పెళ్లి జరిగిపోవల్సిందేనా? జరగకుండా చేస్తుంది? తన్నెల్లా ఆపగలుగుతాడు? వెళ్లి బ్రతిమాలితే? "ఆ పసికందు జీవితాన్ని భగ్నంచేయకండి" అని కాళ్లావేళ్లాబడితే? తనాపనిచేయలేడు. ఆశక్తి తనకులేదు.

ఆలోచనల్లో అలానే మంచంమీద వాలిపోయాడు. కళ్లు మూసుకుపోయాయి.

గంట తర్వాత ఆ గదిలో లైటు వెలిగిద్దామని వచ్చిన కేశవులు వేళగాని వేళలో యజమాని యిలా నిద్రపోతూండటంచూసి విస్తుపోయాడు. ఆయన నిద్రకు భంగం కలుగజెయ్యటమెందుకని వెళ్లిపోదామనుకున్నాడుగాని మళ్ళీ ఏ అనుమానం వచ్చిందో

ఆగిపోయి విశ్వపతి శరీరంమీద చెయ్యివేసి చూశాడు. నిప్పులాగ కాలిపోతూంది. వెంటనే కంగారుపడిపోయి "బాబుగారూ" అంటూ పిలిచాడు. విశ్వపతి పలుకలేదు. కేశవులికి ముచ్చెమటలు పోశాయి. వెంటనే బయటకువచ్చి తలుపులు దగ్గరకు వేసి డాక్టర్ దగ్గరకి పరిగెత్తాడు.

మరో అరగంటకల్లా డాక్టరుతోసహా కేశవులు యింట్లోకి ప్రవేశించాడు. వాళ్లు వచ్చేటప్పటికీ విశ్వపతి కలవరిస్తూవున్నాడు.

"నీ పెళ్లెప్పుడు పాపా ?"

"నేనూ వస్తాను నీతో, నన్ను విడిచి వెళ్లిపోయావుకదూ" అంటూ పదేపదే అనటం సాగించాడు. డాక్టర్ అతన్ని పరీక్షచేసి కేశవుల్ని బయటకు పిలుచుకునిపోయాడు.

"అయ్యగారికేమయింది బాబూ ?"

"జ్వరం తీవ్రంగావుంది. రెండురోజులు గడవనీ. - నా వెంటరా మందిస్తాను" అంటూ కేశవుల్ని తనవెంట తీసుకుపోయాడు.

"బాబుగార్ని ఎలాగయినా బ్రతికించండి బాబయ్యా మీకెంతయినా ఋణముంటాను" అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు దారిలో.

ఆ రోజంతా జ్వరం తీవ్రంగానేవుంది విశ్వపతికి. కేశవులు ఆ రాత్రంతా మేలుకుని ఉపచర్యలు చేశాడు.

మరునాడు ఉదయం కాస్త తెలివొచ్చింది. కేశవుల్ని పిలిచి కాగితం, కలం తీసుకురమ్మన్నాడు. తెచ్చి యిచ్చిం తర్వాత ప్రయాసతో కొంతసేపు రాసి అది కవర్లో పెట్టించి కేశవులి కిచ్చేడు విశ్వపతి.

"ఏమిటి బాబూ ?" అనడిగాడు కేశవులు భయంగా.

"నేనెలాగూ యిక బ్రతకను కేశవులూ" - నా జీవితం అంతంచెందే సమయం ఆసన్నమయింది..." అన్నాడు విశ్వపతి ఆయాసంతో.

కేశవులు కళ్లనీళ్లు పెట్టుకున్నాడు - ఒక నిమిషం ఆగి "అటువంటిమాటలనకూడదు బాబుగారూ - డాక్టరుగారు నయమవుతుందని చెప్పారు."

"నీకు తెలీదు కేశవులూ -" విశ్వపతి అన్నాడు. "ఇక నేను అమ్మగారు అమ్మాయిగారూ పోయినదగ్గరకే పోతున్నాను. నేను చనిపోయింతర్వాత ఈ ఉత్తరాన్ని మణితండ్రిగారికి అందచెయ్యి. ఇంతే నేను కోరేది"

కేశవులు దుఃఖం ఆపుకోలేక పోయాడు. అతని దుఃఖం పైకి పెల్లుబికింది.

"ఏడవకు కేశవులూ. నన్ను విశ్వాసంగా అఖరివరకూ వెన్నంటుతూ వచ్చిందినువ్వే. నీకు నా కృతజ్ఞత"

ఆ తర్వాత విశ్వపతి మాట్లాడలేక పోయాడు. అతనికళ్లు మగతతో మూసుకుపోయాయి.

ఆ సాయంత్రమే విశ్వపతి యీలోకాన్ని విడిచి వెళ్లిపోయాడు.

♦ ♦ ♦

ఇదిజరిగిన మరునాటి సాయంత్రం రేగిపోయిన జుట్టుతో, ఉబ్బరించిపోయిన ముఖంతో కేశవులు మణి తండ్రి రామారావుగారింటికి వెళ్లాడు.

కూతురిపెళ్లి యింకా వారంరోజులేవున్నందువల్ల రామారావుగారు చాలా హడావుడిగవున్నారు. యితన్ని చూసి "ఏంకావాలి?" అంటూ ప్రశ్నించాడాయన.

"మా బాబుగారు మీకీ ఉత్తరం యివ్వమన్నారు."

"ఆయనెవరు ?"

ఆ సమయానికే మణితల్లి అక్కడకి ఏదో పనివుండివచ్చి యిదిచూస్తూ నిలబడిపోయింది.

కేశవులికి తిరిగి దుఃఖం పొర్లింది. "మా అయ్యగారు ... విశ్వపతిరావుగారు ... నిన్ననే చనిపోయారు." అన్నాడు సగంసగం మాటలతో.

రామారావుగారికేమీ అంతుపట్టలేదు. "ఎందుకలా ఏడుస్తావ్? విశ్వపతిరావుగారెవరో నాకు తెలీదే" అన్నాడు.

మణితల్లికి ఒకటిస్ఫురించింది. "ఏదీ ఆ ఉత్తరం?" అని అడిగితీసుకుని గట్టిగా చదివింది.

రామారావుగారికి

మహాశయా! నేనెవరో మీకు అంతగా తెలిసి వుండదుగాని మీ అమ్మాయి మణికి బాగా తెలుసు. రెండు సంవత్సరాలక్రితం మీరు తిరగ్గొట్టిన ఆ గొలుసును యిచ్చిందినేనే. మణిని నేను అంతగా ఎందుకు చేరదీసిందీ మీకు ఆశ్చర్యంగా వుంటుంది. ఎనిమిది సంవత్సరాలక్రితం నాకూ ఒక కుమార్తె వుండేది. దాని పేరు ఇందిర. ఇందిర తల్లి చిన్నప్పుడే చనిపోయింది. అప్పట్నుంచీ నేనేదానిని సాకి పెద్దదాన్ని చేశాను. ఇందిరను నేను ఎంతో ప్రేమగానే చూసేవాడ్ని. అయితేనేం నాబుద్ధి పెడదారిపట్టింది. బంధువుల మాటలువిని వాళ్లప్రోత్సాహంచేత ఒక రెండోపెళ్లివాడికి ఆమెనిచ్చి పెళ్లి చేశాను. అదెంతగానో మొత్తుకుంది. నేను వినలేదు. ఆ సమయానికి అలా వశుడినయిపోయాను. డబ్బుకోసం ఆశించికూడా నేనాపని చేయలేదు. సరే... పెళ్లి జరిగిపోయింది. ఆతర్వాత దాని భర్త టైఫాయిడ్ జ్వరంతో మరణించటం కూడా కొద్ది కాలంలోనే జరిగింది. అప్పుడెంతగా విచారిస్తే ఏం లాభం? అయినా లోకానికి జడిసి దాని రెండో పెళ్లి ప్రయత్నంకూడా చెయ్యలేదు. అది రోజూ రాత్రిళ్లు కుమిలి కుమిలి ఏడ్చేదనుకుంటాను. ఒకరోజు ఏం చెప్పను? అర్ధరాత్రిపూట భావిలో పెద్దగా చప్పుడయింది. వెళ్లి చూస్తే ఏముంది? అప్పటికే ప్రాణం పోయింది. అప్పట్నుంచీ ఒక ఏడాది జీవచ్ఛవంలాగా గడిపాను. అవూళ్లో మనశ్శాంతి లభించక యిక్కడికి వచ్చాను. ఇక్కడా చాలారోజులు పేలవంగానే గడిచాయి. కాని ఒకరోజు బడికిపోతుంటే మీ మణిని చూశాను. ఎందుకనో ఇందిర గుర్తువచ్చి నా మనస్సు కలచివేసినట్లయింది. మణినిపిలిచి స్నేహం చేసుకున్నాను. రోజూ మణినిచూస్తూ మనశ్శాంతి పొందుతూండేవాడ్ని. అయితేనేం నేను ప్రేమచేత ఆపీయిపీయిస్తూ వుండటం అది మీకు యిష్టంలేకపోవటం జరిగింది. అప్పట్నుంచీ మణితో మాట్లాడేందుకూడా వీలులేకపోయింది. ఆమెను చూస్తూ సంతృప్తి చెందేవాడ్ని. తరువాత తెలిసింది మణిపెళ్లి జరుగుతుందని. నేనెప్పుడూ అడుగుతుండేవాడ్ని ఆమెను "నీ పెళ్లెప్పుడు పాపా?" అని. దానికి సమాధానం లభించిందనుకున్నాను. కాని మణి పెళ్లి ఒక వయసు చెల్లినవాడితో అని తెలిసేటప్పటికి కంపించిపోయాను. నాస్థితిగుర్తువచ్చింది. ఆర్థికంగా మీకు శక్తిలేక విధిలేక ఆమె జీవితాన్ని నాశనమార్గంలో పెడుతున్నారు. అలాజరిగించవద్దని నా మనవి. నా ఆస్తినంతా యిదివరకే నాతదనంతరం మణికి చెందేటట్లుగా రాసి ఏర్పాటుచేశాను. ఆ ఆస్తి మీరు వెంటనే స్వాధీనం చేసుకోవచ్చు. మణి జీవితాన్ని నాశనం చేయకండి. ఆమెకు యీడూ జోడూ సరిపోయేటట్లుగానే ఒకమంచి సంబంధం చూసిచేయండి. నేను మిమ్మల్ని ప్రార్థించేదియిదే. తర్వాత ఒక విషయం. ఈ కేశవులు నన్ను విశ్వాసంతో చాలా కాలం వెన్నంటివున్నాడు. నాడబ్బుతో అతన్ని మీరు పోషించండి. నాకడసారికోరిక మన్నిస్తారని తలుస్తాను. మణికి నా ఆశీర్వచనాలు చెప్పండి విశ్వపతి. ఇంతే.

ఉత్తరం చదువుతున్న మణి తల్లికళ్లనుండి నీరు స్రవించింది. అంతా వింటున్న రామారావుగారు నిశ్చేష్టుడయిపోయాడు.

అప్పుడే అక్కడకి ఎందుకనో వచ్చిన మణిని తల్లి దగ్గరకు తీసుకుని హృదయానికి గట్టిగా హత్తుకుంది. ఆమె కంటినీరు మణితలపైన ముత్యాలులాగా జారిపడ్డాయి.

# గృహిణి

శ్రీమతి అ. శకుంతలాబాయి

గృహిణికి ఉండవలసిన లక్షణములెవ్వి? ఆమె తనజీవితము నెట్లు సాగించవలెను? అన్న సంగతులు ఇప్పటివరకూ కూడ అందరు స్త్రీలకు తెలియవనియే చెప్పవచ్చును. అయితే పూర్వముకన్నా అనగా మధ్య కాలముకన్నా ఇప్పుడు మనదేశ స్త్రీలు ముందడుగు వేసిరనియే చెప్పవచ్చును. కాని పూర్తిగా వారు నిర్వహించవలసిన విధులు వారికి తెలియలేదు.

గృహజీవనములో భార్య, భర్త అను ఇద్దరూకూడా నాగలికి రెండు ఎద్దులెట్లవసరమో వీరుకూడా అంత అవసరమే. ఒక ఎద్దు ఒక వైపునకు, రెండవ ఎద్దు రెండవ వైపునకు లాగిన దున్నుట కానట్లే వీరుకూడా ఇద్దరూ వేరు వేరు అభిప్రాయములున్న గృహజీవనము సౌఖ్యముగా జరుగుట చాలా కష్టము. కాబట్టి స్త్రీకి మంచి అభిప్రాయములున్నప్పటికి ఆ పురుషులుకూడా స్త్రీకి కొంత సహాయము చేసిననేగాని స్త్రీ పైకిరాలేదు. ఇప్పటికీ కూడా పురుషులలో స్త్రీలు ఇంతపని చేయుటకేగాని ఇంకెందుకూ పనికిరారను అభిప్రాయముగల పురుషులనేకమంది ఉన్నారనియే చెప్పవచ్చును.

గృహిణికి ముఖ్యముగా మంచి శిక్షణ ఉండవలెను. అనగా ఇప్పుడు అందరు స్త్రీలు బి. ఎ. ఎం. ఎ. లు చదువుచునే యున్నారు. కాని ఈచదువు ఉద్యోగము చేయుటకేగాని సంసారిక విషయములలో ఈ చదువు ఏమాత్రము పనికి వచ్చుటలేదను విషయము అందరూ ఒప్పవలసినదే. దీనికి కారణము మొదట తల్లి శిక్షితురాలైననే పిల్లలుకూడా సుశిక్షితులగుదురు. శివాజీ తల్లి గొప్ప వీరపత్ని గనుకనే శివాజీ అంత వీరుడైనాడు. హిరణ్యకశిపుడు చెడ్డస్వభావముకలవాడైనప్పటికి అతని భార్య లీలావతి సద్గుణశీల. అందువలననే ప్రహ్లాదుడు అంత గొప్ప భక్తుడైనాడు. ఇట్లే మనమెన్ని తార్కాణములు తీసుకొనినప్పటికీ తల్లియొక్క గుణములే పిల్లలలోవచ్చుట మనమెరిగిన విషయమే.

ఇప్పుడు చాలామంది స్త్రీలకు తమ పనిని స్వయముగా చేసికొనుట తప్పని అభిప్రాయముకలదు. ఇది చాలా తప్పు. అందువలన మన పిల్లలను వారి పనులు వారే చేసికొనునట్లు మనము వారికి నేర్పవలెను. అట్లు మనము నేర్ప

నిచో అది మన తప్పేకాని పిల్లల తప్పేమీ లేదని నా అభిప్రాయము. అయితే చెప్పిననుకూడా వినని పిల్లలుకూడా ఉండియుందురు. అటువంటివారిని మనమేమీ చేయలేము. ఇంగ్లీషు దేశపు స్త్రీలు మనదేశపు స్త్రీలకన్నా ఎక్కువ చదువుకొనినవారే. కాని వారు వారి పనులన్నియు స్వంతముగానే చేసికొందురు.

ఇదిగాక స్త్రీ సుశిక్షితురాలైనచో తన పిల్లలను ఇంటినికూడా శుభ్రముగా నుంచుకొనగలదు. ఇదికాక గృహిణికి కొంత వైద్యముకూడా తెలిసియుండవలెను. నల్గురుపిల్లలున్నచోట జలుబో, దగ్గో, జ్వరమో, విరేచనములో ఏవో ఒకటి వచ్చుచునే యుండును. ప్రతిచిన్న విషయమునకుకూడా మనము డాక్టరువద్దకు వెళ్లుట చాలా కష్టము. దానివలన కొంత కాలము వ్యర్థమైపోవును. పైగా ధననష్టముకూడాకల్గును.

సుశిక్షితురాలైన గృహిణికి తన భర్తయే దైవము. ఆయన సౌఖ్యమే తన సౌఖ్యముగా నెంచుకొనుచు ఆయనకు అన్ని విధముల సహాయపడగలదు. గృహిణి సరిలేని ఇల్లు ఇల్లేకాదు. సరియైన గృహిణి ఉన్ననే ఆ యజమానునికి ఆనందముకల్గును. లేకున్న అతను ఎంత సంపాదించిననూ అతను సౌఖ్యపడజాలడు.

మనము పతివ్రతల కథలు చదివిన యెడల వారు వారి పాతివ్రత్యమువలననే ఎన్నో కార్యములను సాధించగల్గిరని తెలియవచ్చుచున్నది. కనుక స్త్రీ గృహసంబంధమైన శిక్షణ తప్పక నేర్చుకొనవలెను. ఇది నేర్చుకొనుటకు ఎచ్చటికో వెళ్లనక్కరలేదు. రాత్రింబగళ్లు చదువనక్కరలేదు. ఎవరి తల్లుల దగ్గర వారే నేర్చుకొనవచ్చును. కాబట్టి ఈ విషయములు ప్రతితల్లి ప్రతిపిల్లకూడా జ్ఞప్తియందుంచుకొని పెద్దవారైన తరువాత తమరు సౌఖ్యపడి ఇంకొకరినికూడా సౌఖ్యముగా నుంచగలరని నమ్ముచున్నాను.



# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

★

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(... సెలవుల్లో స్వామినాథన్ తన మిత్రబృందముతో కలసి తిరుగుతూ కాలం గడుపుతున్నాడు. ఒక రోజున మిడమిడ కాలే ఎండలో ట్రంకు రోడ్డుమీద వచ్చే బండిని నిలవేసి బండివాడిని అదిరించి బెదిరించి అధికారజబర్దస్తీచేసి ఏవేవో ప్రశ్నలతో వేధించారు. అమాయకుడైన బండివాడు వాళ్ల కాళ్లు, గడ్డాలు పట్టుకొని వారి బారినుండి తప్పించుకొని పోయేటప్పటికి తల ప్రాణం తోకకువచ్చింది. ఒకరోజున మధ్యాహ్నమప్పుడు యింట్లోనుండి బయటికి జారుకోడానికి ప్రయత్నిస్తుంటే తండ్రి గదమాయించి చదువుకోమనేసరికి దుమ్ము దూళితో నిండి యున్న పుస్తకాలను చేతితో దులిపి సర్దడం మొదలుపెట్టేసరికి తండ్రి చీవాట్లు పెట్టి గుడ్డతో దులపమన్నాడు. గుడ్డపేలికకని యింట్లోకి వెళ్లి యిల్లంతా చిందులు త్రొక్కి చివరకు పసిపిల్లవాని గుడ్డను తెచ్చి పుస్తకాలను, వస్తువులను శుభ్రపరచి తండ్రి సూచనల ప్రకారం సర్దుతుంటే తల్లివచ్చి ''గుడ్డపేలిక కావాలంటూ కుర్రాడి గుడ్డను తుడవడానికి తెచ్చాడు'' అని ఫిర్యాదుచేసింది తండ్రికి కోపంతో బాటు నవ్వుకూడా వచ్చి యూరుకున్నాడు. స్వామి బుద్ధిమంతుడులాగ పలక, పుస్తకాలతో గదిలో తండ్రి కెదురుగా కూర్చున్నాడు - యిక చదవండి)

(గతసంచిక తరువాయి)

తండ్రి లెఖల పుస్తకమునుఁ దెరిచి,—

“రాముఁడు, తన దగ్గరున్న పది మామిఁడిపండ్ల వలన, అ 15 లు సంపాదింపఁదలిచాఁడు! కృష్ణునకు నాలుగు మామిఁడిపండ్లు మాత్రమే కావలెను. అయితే, కృష్ణుఁడు, యెంత డబ్బు రాముని కియ్యవలెను?” అని చెప్పి, రాయమని, లెఖచెయ్యమన్నారు!

స్వామి, లెఖఁజేసే ప్రయత్నంలో బుర్ర వేడెక్కిపోయేలా తీవ్రంగా యాలోచించాఁడు. కానీ - అంతూ, మార్గం చిక్కకుండావుంది! ప్రతీ మారు చదివినప్పుడెల్లా స్వామి కొక్కొక్క క్రొత్తర్థం స్ఫురిస్తూంది.

•

మామిఁడి పండ్లను గురించిన ఆలోచన స్వామి చేయఁగానే, గొంతు అప్పుడే నీళ్లకోసం నాలుగు

దిక్కులా కలియఁజూచి, దొరకకపోవటంచేత, స్వామిని పీక్కుతినసాగింది!

ఇంతకీ పదిపండ్లకు అ 15 ల ధరను నిర్ణయించడంలో రాముఁడుద్దేశ్యమేమిటా అని స్వామి యాలోచించటాన్ని ప్రధాన సమస్యగా పెట్టుఁకున్నాఁడు! ఇంతకీ-రాముఁడే తరగతికి చెందినవాఁడు? బహుశా-శంకర్‌లాంటివాఁడై వుండొచ్చు! రాముఁడు శంకర్ వంటివాఁడైనప్పు, బహుశా - కృష్ణుఁడు 'బతాని గింజ' లాంటివాఁడై వుండవచ్చు! స్వామి మాత్రం యేకారణంచేతనో, 'కృష్ణుఁడు' మీఁద లెక్కపెట్ట లేనంత దయను చూపసాగాఁడు!

"లెఖనుఁజేసావా?" న్యూసుపేపర్ను చదువుతూ స్వామిని ప్రశ్నించారు, తండ్రి!

"చేస్తున్నా!" అన్నాఁడు.

కొంతకాలంపోయిన తరువాత.

"నాన్నారూ, యీ లెఖను చెయ్యలేనండి!" అని పలకను క్రిందపడేశాఁడు!

"కారణం యేమిటయ్యా? చిన్నలెఖను చెయ్యలేవూ?" అన్నారు!

"ఇఁటువంటిమాదిరి లెఖలు మాస్కూల్లో నేర్పఁలేదండి!"

"పలకిట్లా దీసుఁకురావయ్యా! నీ చేతే లెఖఁజేయిస్తా"నంటూ, లెఖనోతూరి తాను జదివి.—

"పఁదిమామిఁడిపండ్ల ధరా యెంతయ్యా?" అని ప్రశ్నించారు.

యీ ప్రశ్నకు సమాధానం (Answer) యెక్కఁడుందో ప్రశ్నల్లా వెతికి వెతికి చివరకు.—

"నాఁకు తెలీఁదు!" అన్నాడు!

"నువ్వు చూఁడఁబోతే వొఠి వెర్రివెధవలా కనఁబఁడుతున్నావ్! లెఖను చఁదువు... చదవయ్యా. పదిపండ్లకు యెంతడబ్బు రావాలని రాముఁడనుకుంటున్నాఁడు?"

"పదిహేనణాలు కాబోలు!" అన్నాఁడు. స్వామి దృష్టిలో చాలా విపరీతమయిన ధరగా గోచరించింది! ... సరే రాముని దృష్టిలో ఈ ధర సమంజసముగా వున్నప్పటికీ, యీ ధర సరియైందేనా? అనుకున్నాడు.

"అయితే-రాముఁడెంత డబ్బు రావాలనుకుంటున్నాఁడు?" తండ్రి తిరిఁగి ప్రశ్నించాఁడు!

"పదిహేనణాలు!" అని జవాఁబిచ్చాఁడు!

"మంచిది. కృష్ణునికెన్ని పళ్లు కావాలి?"

"నాలుఁగు!"

"నాల్లుపండ్ల ధరెంత?"

తనకెట్లాఁదెల్సు? యీ నాల్లు పండ్లకెంత డబ్బు చెల్లించాలో తన కెట్లాఁదెల్సు?

"ఇట్లా చూడవయ్యా ... నీకెలా తఁగుల్తుందో గాని, చాలా నమ్మకంగా తఁగుల్తుంది లెంపకాయ! నీ బుర్రలో యేముందయ్యా? ... పదిపళ్ల ధర అ 15 లు, అయితే నాల్లుపళ్ల ఖరీదెంత? ... పోనీ ఒక పండు ధరెంతో చెప్పు!"

యీ లెఖకు సమాధానం - గుణించి చెప్పాలో, కొట్టివేసి చెప్పాలో, భాగారించి చెప్పాలో తెలియకపోవటంచేత, స్వామి అసలు నోరే విప్పలేఁదు.

"ఒక పండు ధర చెప్పేవరకూ నిన్ను విడిచిపెట్టేదిలేఁదు!" అని తండ్రన్నారు.

ఇతనితో చాలా చికాకు వచ్చిందే అనుకున్నాఁడు. ఆ ఒక్క పండు ధర యింత తొంద

రగా కనుక్కోవల్సిన అవుసరమేమొచ్చింది? యింతాచేస్తే తను కొనాలా యేడ్వాలా? తన్ను బాధపెట్టేకంటే బజారుకుపోయి ధర కనుక్కోరాగూడదూ? యింటువంటాలోచనలే స్వామి హృదయమును కలవరబెడుతున్నాయ్!

"సరే. పలకిలా యివ్వండి, చేస్తాను!" అని, చివరకు ధైర్యం తెచ్చుగుని అడిగాడు!

ఎప్పటికీ స్వామి లెఖ చేయకపోవటంచేత తండ్రి నాలుగు తగిల్చిచ్చారు. దాంతో స్వామి గొంతెత్తి రాగాలాపన (ఏడుపు) ప్రారంభించి, చివరకు.—

"కృష్ణుడు ... ఊఁ ... కృష్ణుడు... అ 6 లు చెల్లించాలి!"

అని యేడుపు కంఠంతోనే సమాధానం చెప్పాడు!

## ౧౮

పెద్ద సెలవలు తరువాత, మరల బడులన్నీ తెరవబడినాయ్. స్వామినాథన్ వేరొకబడిలో (Local Board High school) ప్రవేశపెట్టబడ్డాడు! యీ మార్పు స్వామి యభివృద్ధికెంతైనా తోడ్పడుతుందని తండ్రి ఆశయం!

ఒకనాటి మధ్యాహ్నం స్వామి గదిలోకూర్చుని కళ్లజోడద్దాలతో క్యామెరా (Camera) చేసేందుకు తాపత్రయబడుతున్నాడు! యింతలో రాజం వచ్చాడు.—

"హలో! హలో!! రాజం! వస్తున్నట్లయినా నాకు కబురు పంపలేదే?"

"నీ చేతిలోదేమిటయ్యా?" రాజం ప్రశ్నించాడు!

"ఓఁ!" అంటూ చెప్పేందుకు నసగసాగాడు!

"ఏదీ, యేదీ, వోమారు చూడనియ్!

"ఏమీలేదయ్యా!" అంటూ, రాజమ్‌కిచ్చాడు! క్యామెరాను పరిశీలిస్తూ.—

"మన 'క్రికెట్' టీము మాటేం? జెప్పావ్?" అని ప్రశ్నించాడు రాజమ్!

అసలు స్వామి క్రికెట్ ఆట విషయమే మరచిపోయాడు, కారణం యేమిటంటే ఆడేందుకు తాను అసమర్థుణ్ణని!

"లేదురాజం, నేనాడగలనని, నేననుకోటంలేదు! ఎట్లా ఆడాలో నాకు తెలియందే!"

"అది ప్రతీవారు అనుకునే విషయమే! నా విషయం నాకే దెలియదు. అంత మాత్రంచేత నీవుమల్లే నిరుత్సాహం పొందుతున్నావా?" రాజమ్ అన్నాడు!

యీ సంభాషణ స్వామికెంతో విన వుత్సాహంగావుంది!!

"మనం చాలా టీముల్తో పోటీచెయ్యగలం, ఒక్క మన స్కూలు టీముతోదప్ప! వాళ్లనెవరు జయించలేరని, వారనుకుంటున్నారు!" స్వామినాథనన్నాడు!

"ఏమిటీ? బోర్డు స్కూలు బొద్దెంకలు అట్లా అనుకుంటున్నాయా? వెధవల్ని, నమ్మిపారేయుం, సందేహంలేదు!" రాజం అన్నాడు.

"అయితే, మన టీమునే పేరుతోపిలుస్తే బాగుంటుంది?"

"నీకు తెలీదూ! 'ఎం. సి. సి.' అని!" రాజం అన్నాడు!

"అది 'హాబ్స్' టీము పేరుకాబోలు? అవును గదూ? ఆ పేరు పెట్టుకొని మనం ఆడుతూంట్నే, మనల్ని వాళ్లు కోర్టులోంచి యీడ్చేయరూగదా?"

"ఎవరన్నారు! మనకేటువంటి ఆపదవచ్చినా, జడ్జి సమక్షంలో - 'ఎం. సి. సి' అంటే—'మాల్గుడి, క్రికెట్, క్లబ్' అని చెబుదాం!"

"మరియొకపేరు పెట్టడం చాలా మంచిదేమోనని నా అభిప్రాయం రాజం!" స్వామన్నాఁడు.

"అయితే యేపేరు పెడదాం?" రాజం ప్రశ్నించాఁడు.

"ఫ్రెండ్స్ యెలెవిన్" అని పెడితే?

"ఫ్రెండ్స్ యెలెవిన్ ?" (Friends Eleven) అని రాజం యాలోచింపసాగాఁడు!

"లేకపోతే - జంపింగ్ స్టార్సంటే? (jumping stars)" స్వామి, అన్నాఁడు!

"చెడ్డదికాఁదులే!"

కొంతకాలంపోయిన తరువాత.—

"రేపుదయం నన్ను కలుస్కోగలవా స్వామీ? మణినికూడా రమ్మనమని చెఁబుతాను, అప్పుడు పేరు నిర్ణయించుఁగోవచ్చును. మణి దగ్గరుంటే వాఁడికి తోచిన పేర్లుకూఁడా చెఁబుతాఁడు!" రాజం అన్నాఁడు.

కొద్ది నిముషముల తరువాత—

"మనటీము ప్రారంభించఁగానే, మనం గవర్నమెంటుకు పన్ను కట్టవల్సివుంటుంది కాబోలు!" స్వామి తనకున్న అనుమానమును వెల్లడించాఁడు. "యీ ప్రపంచంలో, ప్రతివస్తువుమీఁద పన్ను రుద్దడమే గవర్నమెంటాశయమనుకుంటున్నావా? యింతకీ మనం పన్నెందుకు చెల్లించాలనుకుంటున్నావ్?" రాజం ప్రశ్నించాడు!

"మనం పన్ను కట్టామంటే, మనటీము పేరే టీమయినా పెట్టుకుంటే గవర్నమెంటు ఆక్షేపిస్తే, మనకే మంచిదిఁగదూ?" అని స్వామి అన్నాఁడు.

◆ ◆ ◆

వాళ్ళు - రాజం టేబులుచుట్టూ గూర్చున్నారు. ఆఁటలకు సంబంధించిన సామానులనమ్మే 'బిన్స్' (Binns) కంపెనీవారి కేటలాఁగును తన ముందర పెట్టుఁగుని మణి పరిశీలిస్తున్నాఁడు!

"ఏదీ, నన్నొకతూరి చూడనియ్!..." రాజమ్ అన్నాఁడు!

టేబిలు ముందరకు వంగి.—

"కేటలాఁగులో బేట్లు (బొమ్మలు) చూచేందుకెంతో అందంగా వున్నాయ్. స్వామీ! నువ్వొకమారుచూడు!" రాజమ్ అన్నాఁడు!

స్వామి బుర్రను ముందుకువంచి.— "చూచేందుకు చాలా బాగున్నాయ్. కేటలాఁగులో చూచేందుకేదయినా అందంగా కనఁబఁడతాయిలే!" స్వామి ఆక్షేపణ తెలియజేసాడు!

మణి, స్వామి బుర్రను పుస్తకంమీఁదకునెట్టి.—

"వెధవా, పైకంపెనీ బేట్లకు వీఁటికీగల బేధాన్ని గుర్తించరా! పెద్ద యాఁటగాడిమల్లే నటించకు" అన్నాఁడు!

"స్వామి, నేను చెబుతూవుంటాను, కాగితం, పెన్సిలూ పుచ్చుగుని రాస్తూండు!" అని రాజం అనఁగానే, స్వామి రాసేందు కుపక్రమించాఁడు.

"ఎన్ని బేట్లు రాయమంటావ్ రాజం?" అని స్వామి ప్రశ్నించాఁడు!

"మూఁడురాయ్, సరిపోతాయంటావా మణీ?" రాజం ప్రశ్నించాఁడు!

"మూఁడుకొని, డబ్బు దండగ పెట్టడమెందుకు రాజం? రెండు చాల్ను!" మణన్నాఁడు!

"ఆఁట మధ్యస్థంలో వొకఁటి విరిఁగిపోతే?"

"మన ప్రతి కక్షిదారులకుగూడా బేట్లు పంచి పెడదామనుకుంటున్నావా ?"

"సరే. బేటు ఒకవేళ ఆట సంగోరులో విరిగి పోతే, మనం ఆట ఆపేస్తామనుకుంటున్నావా ?"

"రెండు చాలున్ను రాజం! డబ్బుదండగ చెయ్యాలనే వుద్దేశ్యం నీకుంటే కాను!" మణన్నాడు!

రాజుకి సంతోషం అధికమయింది! తనకుర్చీ లోంచి దిగ్గునలేచి పోయి, మణి కుర్చీ చెయ్యిమీద కూర్చొని, కేటలాగులో ప్రచురింపబడిన బేట్లు (Bats) తాలూకు బొమ్మలను చూడ సాగాడు!

క్రిందబడి, మీదబడి, ఎలాగైతేనేం, ముగ్గురూ ఒక నిర్ణయానికి వచ్చి, తమ టీముకు కావల్సిన వస్తువులను నిర్ణయించారు!

, తరువాత — బిన్సు కంపెనీవారికి వుత్తరం రాసేందుకు రాజముపక్రమించాడు.

'From
M.C.C. (And Victory union Eleven)
Malgudi.
'To
Messrs. Binns,
Sportsmen,
Mount Road, Madras.'

అయ్యా,

మాటీముకు రెండు జూనియర్ విల్లార్డ్ బేట్లు (Junior willard Bats) 6 బంతులు, గూటములు (wickets) మొదలగు వస్తువులు వేగిరం పంపవలెను. చాలా జరూరు. తరువాత డబ్బు పంపగలము. భయ పడవద్దు. చాలా జరూరు!

ఇట్లు, మీ వినయవిధేయుడు,

కెప్టెన్ రాజం (కెప్టెన్)

వీరు ముగ్గురూ తీరుబడిగా కూర్చున్నారు. యింతలో పోష్టుమేనక్కడకొచ్చి, వుత్తరానొకదాన్ని రాజమ్‌కిచ్చి, వెడలిపోయాడు.

"ఎవరు రాసారో చెప్పండి చూదాం ?" రాజం అడిగాడు.

"బిన్సు"

"కాదు. మన హెడ్మాష్టరునుండి కాబోలు!"

"ఎవరో మరి!"

"జే. బి. హాబ్స్"

"కాదు. శంకర్ నుండి!" రాజమ్ సంతోషంగా ప్రకటించాడు.

"శంకర్! మనమందరం ఆ పాత దొంగను మర్చే పోయాం. స్వామి, మణి ఆకార్డును రాజం దగ్గర నుండి తీసుకుని చదవ సాగారు:

ప్రియమైన స్నేహితుడా,

మానాన్నగారిక్కడకు వచ్చేయటం చాత, నేనిక్కడే చదువుతున్నాను. మా అమ్మకూడా యిక్కడేవుంది. అందరం యిక్కడే వున్నాం. నేను క్షేమంగా వున్నాను. మీరందరూ క్షేమంగావున్నారని భావిస్తున్నాను. ఇక్కడ చాలా వేడిగావుంది! నాకు మూడు దినములునుండి జ్వరం కాస్తూంది; మందు త్రాగేను!

నేను జాగ్రత్తగా చదివినట్లయితే, భగవంతుని కృప వల్ల ప్యాసౌతాననుకుంటున్నాను. స్వామీ మణీ క్షేమంగా వున్నారా ? ఇక్కడ చాలా వేడిగా నుంది! క్రికెట్ ఆట ఆడుతున్నాను. ఇంతకన్న యెక్కువ వ్రాయలేను!

నీ అత్యంత ప్రియస్నేహితుడు
'శంకర్'

మరిచిన విషయం:—

నన్ను మరువకు
'శం'

ఒక గంటలో ముగ్గురూ మూఁడుత్తరములు వేరు వేరుగా రాశారు! మణి - తాను వుత్తరంరాయఁబోతూ, యేమిరాసేందుకు 'విషయాలు' (Subject) దొరకకపోవటంచాత, శంకర్ రాసిన వుత్తరాన్నే తిరిగిరాసి శంకర్‌కు పంపేందుకు నిశ్చయించాఁడు!

ఇఁక స్వామి, రాజం వ్రాసిన వుత్తరములలో భాష భేధంగావుందిగాని, విషయాలు ఒకఁటే!
అందులో:—

తాము క్షేమంగావున్నామని, శంకర్ తప్పక ప్యాసౌతాడని, వాఁడుక్షేమంగా వున్నట్లు తాము భావిస్తున్నామని, రాస్తూ, తమ 'క్రికెట్' గురించి వివరంగా తెలిపారు. లేఖముగింపులో - తమ టీము: శంకర్ ఆఁడుతూన్న టీముతో పోటీ చేసేందుకు సిద్ధంగా వున్నదని రాశారు.

* * *

'కెప్టెన్, ఎం. సి. సి., మాల్గుడి -' అని 'బిన్సు' కంపెనీనుండి రాజమ్‌కు వుత్తరం రాగానే - ఒక్కమారు - ఎం. సి. సి. కి అఖండ విజయం వచ్చినట్లుగానూ, యీ టీము: పెద్ద పేరు ప్రఖ్యాతులను గడించిన టీములలో జమైనట్లుగా రాజం భావించి వుప్పొంగసాగాఁడు!

ఆ వుత్తరంలో రాజమ్‌కు - వందనము లర్పించుచున్నామని, మొత్తం సొమ్ములో 25 శాతము డబ్బు పంపమనియు, మిగతా సొమ్ము వస్తువులను తీసుకునేటప్పుడు చెల్లించ వచ్చుననియు మున్నగు విషయాలు బిన్సు కంపెనీవివరించి వ్రాశారు.

యీ వుత్తరాన్ని అర్థంచేసుఁగోఁడానికి ఆ ముగ్గురూ తలక్రిందులౌతున్నారు. ఇంతకీ బిన్సు కంపెనీవారు సరుకులను పంపుతారో పంపరో అన్న సమస్యే వీర్ని యెక్కువగాభరా పెడుతూంది. ఆ లేఖలో '- OBLIGED' అని వ్రాయబడిన పదాన్కి అర్థం యేమిటో తెలియక మణి తికమక పడసాగాడు. చివరకు నిఘంటువు చూచినా లాభంలేకపోయింది!

"ఆ వెధవ యిటువంటి పదాన్ని ప్రయోగించాడెందుకూ? - దీనికర్థమేలేదు. దీనిని బట్టి వాడు మనతో సరసాలాడుతున్నట్లు నేనను మానిస్తున్నాను!" అని మణి అన్నాడు!

"వాడేదో 25% గురించియేమిటో వ్రాసినట్లుందయ్యా! అదేమిటో తెల్సుగోవాలనివుంది!" రాజం అన్నాడు.

"ఆఁ! యిప్పుడు నాకీ వుత్తరం అర్థమైందే, మీకీ వుత్తరం అర్థంకానందుకు నేనెంతో ఆశ్చర్యపోతున్నాను; గత పరీక్షల్లో నీకు నూటికీ 60 మార్కులు వచ్చాయిగదూ, దాన్నిగురించి వుత్తరం రాసుంటాడు!" అని స్వామన్నాడు.

"నీకేమయినా మతుందా? నా మార్కులతో వాడికేం సంబంధం! ఆఖరికి - బి. ఏ. వాడుకూడా యీ వుత్తరాన్ని అర్థంచేసుగోలేఁడు!" అని రాజమ్ అన్నాడు!

(సశేషం)



# నిస్పృహత

శ్రీ దొండపాటి రామమూర్తిగారు

(జూలై సంచిక తరువాయి)



మఱియు, గోవుండు, పిమ్మటికాలమున, బాలుఁడింకను బాలభావాంకితుండు
కాకపూర్వము, తాను, కఠినమైకట్టుగని స్వాంతమ్ముగలిగినవాఁడెయయ్యుఁ
దనదృష్టిపథమునఁ దనయునుంపఁగఁగోరు మడులఁబాటుపడెడు నెడనుగాని
సంకెలతోముందు జాగిల్లిగొఱ్ఱెతోఁ దనగృహద్వారమ్ము దఱిఁగనంత
నొంటరిగనిల్చి వృద్ధమైయున్నపెద్ద చెందిరపుఁజెట్టుక్రింద నాసీనుఁడగుచు
గొల్లవారల మెత్తైన బల్లమీఁదఁ దాను వసియించు సమయమందైనఁగాని ॥

అతులగభీరతామహితమై తగునీడని వాసయోగ్యమా
కతమున, నున్నిచేత్తలకు గాఢతరాతపవేళలందు, నా
క్షితిజమెసంగెఁ 'గత్తెరల చెట్టు'ని గ్రామ్యపదోక్తమౌచుఁ బ్ర
స్తుతమును నామహీజమటఁ జూడఁగవచ్చుఁ దదాహ్వయమ్మునన్ ॥

తమచుట్టుఁజేరిన తక్కినవారితో వారిద్దఱటనీడఁ గూరుచుండ
నెల్లఱునాసక్తి నుల్లాసమును జెందియున్నకాలమున నాపిన్నవాఁడు
గొఱ్ఱెలనవ్వాని గొరిజలతోఁబట్టి వాని శాంతిని భంగపఱుచునెడలఁ
గాని, చప్పట్లతోఁ గదలనికత్తెర క్రిందివానిని బెదరింపఁగాని
తనమనోభావ మభ్యాసమునకుఁ దెచ్చుఁ దప్పుఁ దప్పించు నమితవాత్సల్యపూరి
తావలోకమునలచేత నర్భకునకుఁ బెట్టుచీవాట్లచేతను వృద్ధుఁడెపుడు ॥

దైవానుగ్రహ సద్విధానమహిమన్ దద్బాలుఁడారోగ్యరే
ఖావిస్ఫూర్తి గులాబి పూలజతనాఁ గన్పట్టుచేఁ జెక్కుఁ జెం
గావిన్ బంచశరద్వయస్థితుఁడు కాఁగా వానికై గోవుఁడే
కావించెన్ నిజహస్తసంఘటితమున్ గై దండఁగా దండమున్ ॥

తగినట్టి వేణుదండముఁ । దెగఁగొట్టి యినుంపకట్లు తీఱిచి సకలాం
గగణ సమృద్ధినజాజీ । పుగుదియగ నొనర్చి దానిఁబుత్రునకిచ్చెన్ ॥

ఆ దండయాయుధంబుగఁ । దాదండయుఁ గొంత విఘ్నదాయకుఁడును
నై । పాదుకొనుఁగాపులాగా । నాదారకుఁడడ్డఁ ద్రిప్పనజ సంఘమ్ముల్ ॥

ఇటులగుటీడు రాకమును పే సతతమ్మునతండు కార్య సం
ఘటననియుక్తిఁ గాంచుటయె కారణమొక్కెడ । దండ్రిచేఁగొనున్
నటుఁడుపహాసమే వినుతివాక్యమునే ; గుదెయో, మెలుంగొ చూ
పులుఁగొ, తర్జనమ్ము, పనిపూర్తి యొనర్పక పీకనుండినన్ ॥

ఈ రహి పదియేడులు నిం । డారిన ప్రాయమ్ము వచ్చినంతనె లోకం
డోరుగఁ గలిగెను పర్వత । మారుతఝంఝూటములను, మఱియునతండున్ ॥

కష్టములకైన నాయాసకరములైన దీర్ఘమార్గంబులకునైన దిగులుపడక
కొండలకుఁ దండ్రి వెన్నాడుచుండునెపుడు సహచరులరీతి వారిటు సంచరింత్రు ॥

మును ప్రేమించిన వస్తువుల్ ప్రియతమంబుల్ గొల్లకిష్టంచు, సూ
ర్యుని భాస్వంతు, సమీరు శ్రావ్యునిఁగ రూపొందించునూహాఝరుల్ .
తనయానీతములంచు, ప్రోడయిన వృద్ధస్వాంతముల్ దాఁ జిగి
ర్చినటంచుల్ బనిఁబూని వేఱుగనిఁకన్ జెప్పంగ నాకేటికిన్ ॥

ఈ పగిది జనకుదృష్టినె । యేపయి బాలుండు పదియునెనిమిదియేడుల్
ప్రాపించినంతనాశా । దీపుఁడు సుఖదుండునయ్యెదినమాతనికిన్ ॥

ఈ లీలనాకుటుంబ । మ్మాలంబిత సూక్ష్మజీవనానుదినమ్మై
కాలక్షేపము సేయఁగ । నాలింపఁగవలసె గోపుఁడప్రియవార్తల్ ॥

తెలిపెద బహుపూర్వికమే । నిలిచెన్ బ్రతిభువుగగొల్ల, నిజభ్రాతృసుత
స్థలమున ; వానిందీర్పఁగ । వలసినవిధి తప్పదయ్యె వానికి నెటులున్ ॥

అతని సహోదరాత్మజుఁడనంత పరిశ్రమజీవియైన నా
ర్జితమసద్దైనవాఁడు, దురదృష్టవశంవదుఁడౌటనెల్ల బా
ధ్యత మనవృద్ధునెత్తిబడఁ దండుగ యార్తిదమైన శిక్షయా
నతని సగమ్ము నాస్తికి సుమంత కొఱంతగనుండునైననున్ ॥

వృద్ధుఁడెవ్వఁడుఁ దనవలె నింతనష్ట । మొనసియుండఁడటన్న చింతనము
వాని । జీవితాశ సగముకంటె లావుగొనియె । ననుకొననివార్త విన్నరవంతదనుక ॥

(సశేషము)






## బఖాళాభాత్

అర్థశేరు మంచి నెల్లూరి బియ్యమును మెత్తగా వండవలెను. మూడు శేర్ల తియ్యటి మీగడపెరుగులో కొంచెము ఉప్పువేసి, ఆవాలు, జీలకర్ర, మినప్పప్పు అయిదారు మిరపకాయలువేసి నేతితో తిరగబోత పెట్టవలెను. అల్లపుముక్కను సన్నగా తరిగి, ఒక స్పూను సొంటిపొడి చేర్చి పెరుగులో కలపవలెను. దొరికిన యెడల ఒక పచ్చిమామిడికాయను చిన్నచిన్న ముక్కలుగా తరిగి పచ్చిమిరపకాయలనుకూడ చిన్న ముక్కలుగా చేసి పెరుగులో కలిపి కొత్తిమిరి చేర్చవలెను. అయిదు పలముల కొత్తవెన్నతోకూడ వేడి అన్నమును ఉండలు లేకుండునట్లు పెరుగులోవేసి పలచగా త్రాగుటకనుకూలముగ ఉండునట్లు కలపవలెను. దధ్యోదనమువలె ముద్దగా ఉండకూడదు. బహురుచిగానుండును.

వంగోలు కనకవల్లి

## ఉర్లగడ్డఅప్పం

10 పలముల వుర్లగడ్డలు తెచ్చి వుడకపెట్టి పైతోలు వలిచి పెట్టుకోవలయును. 1 పావు గోధుమ పిండి వకగిన్నెలోవేసి అందులో ఆవగింజంత ఉప్పు 1 స్పూను, పేరిన నెయ్యివేసి కొంచెము నీళ్లువేసి ముద్దగా తడిపి పెట్టుకోవలెను. పూరికి తడిపేదానికన్న కొంచము పలచనగా తడిపి పెట్టుకొనవలెను. 5 పచ్చి మిరపకాయలు, కొంచెము అల్లము, తగుమాత్రం వుప్పువేసి మెత్తగానూరి ఆగడ్డలలోవేసి చేతితో బాగుగ నలపవలెను. అందులో 1 నిమ్మపండుపిండి, పలంనూనెవేసి పొయ్యిమీద పెట్టి దానిలో 1 స్పూను మినపప్పు, 2 స్పూనులు ఆవాలువేసి, వేగిన తర్వాత, 2 రెవటలు కర్వేపాకు కూరలో వేసి బాగుగా కలిపి, నిమ్మపండంత వుండలుచేసి పెట్టుకొనవలెను. గోధుమ పిండిలో కొంచెము నూనెవేసి బాగుగా కలిపి వుసిరిగకాయంత పిండిని చేతిలో పెట్టుకొని నూనెతో వల్లెగా గుండ్రముగాచేసి, అందులో ఆ కూర గుండమును పెట్టి చుట్టు ఆవల్లెతో మూయవలెను. దానిని వక అరటాకు తీసుకొని చమురురాచి, దానిని గుండ్రముగా తట్టి, 10 ఫలముల నూనె పొయ్యిమీద పెట్టి, కాగినతర్వాత, ఈ అరిటాకు మీద అప్పం నూనెలో వేసి బాగపొంగిన తర్వాత తిప్పివేసి, అరిసెల పలకలతో వత్తితీసి తినిన చాలరుచిగావుండును.

శ్రీకంఠం శారదాంబ

## బంగాళాదుంపఉప్మా.

అరవీశబంగాళా దుంపలు నీటితో ముక్కలుగాచేసి వుడికించి పెచ్చుతీయవలెను. 1 తులం మినపప్పు 1 తు. శనగపప్పు 1 తు. ఆవాలు, కొంచెం మెంతులు తగు పచ్చి మిరపముక్కలు, అల్లంముక్కలు, కర్వేపాకు 4 తు. నేతిలో వేయించి 4 అళాకులనీరు పోయవలెను. 2 తు. ఉప్పువేసి 1 కొబ్బరికాయకోరి వేయవలెను 1 అళాకు గోదుమరవ్వవేసి 15 నిముషములు వుడికించి, వుడికినముక్కలు మెత్తగాదంపివేసి, 2 నిమ్మకాయలు రసంపిండి, అళాకు నెయ్యిపోయవలెను ,జీడిపప్పుకూడా వేయవచ్చును.

చావలి అన్నపూర్ణాబాయి




శ్రీమతి నన్నపనేని మంగాదేవి

సాయంసమయం. సూర్యుడు పూర్తిగా ఛాయాదేవి కౌగిలిలో దాక్కుని అలసట తీర్చుకుంటున్నాడు. సాయంకాలపు నీరెండ గోదావరీ జలాలమీద పడి తళతళలాడు తోంది. తీరాన ఉన్నయిసుక ఆ నీరెండలో వింతకాంతులలో జలకాలాడుతోంది. ప్రకృతి ఒక మెరుగు తొడుగు తొడుక్కు న్నట్లుగా మిడిసి పడుతోంది. ఆకాశం చిత్ర వన్నెలతో మెఱుగులు దిద్దుకుంటోంది. శకుంత సంతానం కలకలస్వరంతో గూళ్ళు చేరుకోడానికి వేగిర పడుతున్నాయి. ఈ సుందర ప్రకృతితో నాకు నిమిత్తమేలేదన్న ట్లుగా కూర్చున్నాడు రామకృష్ణ. అతని విశాలమైన నేత్రాలు ఆవేదనను వెళ్ళ గ్రక్కుతూ శూన్యంలోకి చూస్తున్నాయి. అతనికి తన యేడాది వివాహ జీవితంలోను జరిగిన సంఘటనలన్ని తలపుకు రాసాగాయి.

కృష్ణకి వేదనాకరమైన సంఘ టనలు విచారించే ముందు కృష్ణ గత జీవి తాన్ని గూర్చి కూడ కొంత తెలిసి కొందాము. పుట్టటానికి రామకృష్ణ మధ్య రకం కుటుంబంలో పుట్టినప్పటికి పరిస్థితుల వలన పొట్టగూడ గడవని బీదవాడయ్యాడు. రామక్రిష్ణకి పదోయేట తల్లిపోయింది. అప్పటికి రామక్రిష్ణ రెండవఫారం చదువు తున్నాడు. అతనికా అదృష్టం పట్టడానికి కారణం అతడు జ్యేష్ఠుడు కావడమే. రామ కృష్ణ తండ్రి ఆ భారీకుటుంబాన్ని పోషించ లేక భార్యా వియోగం భరించలేక వైరా గ్యపథం అనుసరించాడు. దిక్కులేని కృష్ణను అతని సోదరులను రామకృష్ణ పెదనాన్న చేరదీసి కాపాడాడు. రామకృష్ణ పడవలసిన తిప్పలన్నీపడి ఎల్లాగో బి. ఏ. డిగ్రీ సంపా యించాడు. అతని డిగ్రీని అందాన్ని గుణాన్ని చూసి భాగ్యవంతులుగానే పరిగ ణించబడుతున్న పరంధామయ్యగారు పిలచి పిల్లనిచ్చాడు. రామకృష్ణ తనకు కలిగిన అదృష్టానికి ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. తనతో బి. ఏ. లు చదివిన వారంతా పొట్టచేత్తో పట్టుకుని గుమస్తాగిరీ కోసం అష్టకష్టాలు పడుతున్నారు. తన అదృష్టం వలన తనకా దుర్గతి పట్టలేదు. తను హాయిగా నళిని తెచ్చే డబ్బుతో సర్వసుఖాలు అనుభవిస్తూ కూర్చోవచ్చు. నళిని చేపపిల్లల్లాంటి కళ్ళ ల్లోకి చూస్తూంటే, ఆమె ముడుచుకున్న గులాబీరేకుల్లాంటి పెదవులను తాకుతూంటే

ఎన్ని యుగాలైనా యిట్టే 'గడచిపోతాయ్' అనుకున్నాడు రామకృష్ణ.

నళిని కాపరానికొచ్చిన రోజున ఫ్రెండ్స్ కందరికీ చిన్న టీపార్టీ యిచ్చాడు రామకృష్ణ. ఆరోజున రామకృష్ణ పొందిన ఆనందానికి అంతులేదు. అతనికి కలిగిన భాగ్యానికే అసూయపడిన స్నేహితులు నళిని అందాన్ని చూచి వారికి యీర్ష్య అధికమయ్యింది.

నళిని వలన రామకృష్ణ తానూహించిన ఆనందాన్ని పొందలేక పోగా ఆవేదన కలిగింది.



నవదంపతులిద్దరూ టేబుల్ వద్ద కూర్చొని కాఫీ త్రాగుతున్నారు. "మాయింట్లో యిల్లాంటి వెన్నున్నాయనుకున్నారు! మా యింట్లో అసలు వెండిసామాను తప్ప వాడమండీ" అన్నది నళిని ఖాళీయైన వెండి కప్పను తిరిగి కాఫీతో నింపుతూ.

"వెండివికాకపోతే గొంతు పట్టుకుంటుందా?" అన్నాడు రామకృష్ణ వెటకారంగా.

"అవును. తిండికే గతిలేనివారికి వెండి వస్తువుల్లో విలువేం తెలుస్తుంది"? అని యీసడించింద.

రామకృష్ణ అవమానంతోను అభిమానంతోనూ దహించుకపోయాడు. అతని రక్తజీరలు గల విశాలనేత్రాలు అరుణపుంజాలైనయి. గర్వంతోకూడిన ఆమె దురభిమానం దెబ్బతిన్నది. తన పుట్టింటివారి ఐశ్వర్యంచూసి యీరసపడతాడు అనుకుంది. ఆమె స్వభావాని కనుగుణంగా కోపం వొచ్చింది. ఆమె అహంకారం వంకర ఆలోచనలు కల్పించింది. ఏమీలేని వాడికి పుట్టెడైశ్వర్యంతో పిల్లనిచ్చినా తన తండ్రిని లక్ష్యపెట్టడు. తన తండ్రి ఎంతో ఉదారుడు కనుకనే ఆస్తి లేకపోయినా అక్షరం ముక్కలుచూచి యితని కిచ్చాడు. ఈ ఆలోచనలతో కాంతం కోపం అధిగమించింది. మూతి ఒక్కసారి ఆ మూల నుండి యీ మూలకు త్రిప్పి గిరుక్కునలేచి వెళ్ళిపోయింది.

ఆమె ప్రవర్తన అతని కోపాన్ని తీవ్రం చేసిందికాని ఆతడా కోపాన్ని లోపలే అణచుకున్నాడు. ఎప్పుడూ పుట్టింటివారి ఐశ్వర్యంమీద మమకారమైతే యింకా భర్తకామేం మమత చూపిస్తుంది?

ఇల్లాంటి సంఘటనలతోను నళిని ఎత్తి పొడుపులతోను, మూతివిరుపులతోను ఆ దంపతులలో ఐక్యం విచ్ఛిత్తైపోయింద. ఎడమొఖాలు పెడముఖాలతో రోజులు దొర్లిపోతూన్నాయ్.

♦ ♦ ♦

"మొన్న మా అన్నయ్యగారమ్మాయికి చెప్పులు తెచ్చిపెట్టమన్నారటగా. ఎందుకని తీసికెళ్ళలేదు?" కొంచెం ధీమాగానే అడిగింది.

"..................."

"మానంత మనిషిని యిక్కడిల్లా వాగుతోంటే మాట్లాడకుండా అల్లా చూస్తారేం? చేసే ఉద్యోగం లేకపోయినా చెప్పిన పనిగూడా చెయ్యకపోవడమా" అని సాగదీస్తూ రెట్టించింది.



ఈ మాటలు రామకృష్ణకి శూలాల్లా తగిలాయి. అభిమానం కోపం ముంచుకొచ్చింది. ముఖం జేవురించింది. రక్తరేఖలుగల అతని కళ్ళు మరింత ఎఱ్ఱనయ్యాయి అయినా తమాయించుకుని అన్నాడు. 'మీవాళ్లకు చెప్పులు మోయడానికి కాదు యిక్కడనేనుంట''

"నెత్తి కెక్కడానికి - వాళ్ళు పెట్టింది తింటున్నామన్న విశ్వాసమున్నా లేదుమీకు" అంది మామూలు ధోరణిలోనే. కాని రామకృష్ణ కోపం యీ మాటతో హద్దులు దాటింది. అభిమానం లేశంఉన్న ఏమగవాడూ యీ మాటకు సహించ లేడు మరి. రామకృష్ణ కోపంతో 'నోరుముయ్' అని గర్జించాడు. అతనిచేయి అప్రయత్నంగానే పైకిలేచింది. ప్రయత్నపూర్వకంగా అతను యెత్తినచేయి దించాడు.

"నాసొమ్ము తింటున్నాననన్నా లేకుండా నా మీదకే చేయెత్తాడు'' అన్న అహంతో దుఃఖంతో మిళితమైన మాటలు గడప దాటుతున్న రామకృష్ణకి స్పష్టంగా వినిపించాయి.

ఎక్కడికిపోతారు? పోతేపోనీ నన్నేం బెదరిస్తారా? సాయంత్రానికి వారే వస్తారు అనుకుంది పొరలు క్రమ్మిన నళిని. తన పైకి చేయెత్తుతాడా? ఎంత అహం? ఏం చూసుకుని? అసలితని తత్వమే యింత. కృతఘ్నుడు అనుకుంది నళిని.

♦ ♦ ♦

గోదావరీ తీరంలో సాయం సమయంలో ఆలోచనలలో మునిగి తేలుతున్న రామకృష్ణ చచ్చినా యింక దాని డబ్బు తాకనని శపథంచేసాడు. తను స్వయంగా డబ్బు సంపాదించేవరకూ యింటి ముఖం చూడకూడదనుకున్నాడు. అతి కష్టం మీద వారం రోజులలోనే ఒక చిన్న ఉద్యోగం సంపాయించగలిగాడు రామకృష్ణ. ఉద్యోగంలో ప్రవేశించిన సాయింత్రమే యింట్లో కావలసిన వంట సామగ్రంతా తెచ్చాడు. చిన్నప్పుడు అనుభవం వలన తానే స్వయంగా వంటచేసుకొని భుజించాడు. నళిని రామకృష్ణ ప్రవర్తన చూచి ఆశ్చర్యపోయింది. రామకృష్ణ యింటి మొఖం చూడని యీ వారం రోజులలో ఆమెలో కొంత చైతన్యం కలిగింది. నేడు రామకృష్ణ రాకలో ఆమె మనస్సు కొంచెం వికసించింది. "ఈ వారం రోజులూ ఎక్కడ గడిపారు?" అంది కొంచెం నెమ్మదిగానే. రామకృష్ణ జవాబివ్వలా. అతని మౌనం ఆమెమీద బాగా పనిచేసింది. ఆమెకు తెలియకుండానే భర్తను గురించి శ్రద్ధ తీసికోసాగింది. తను కనపడకుండానే చాటున ఉండి ఎప్పుడేదికావాలో అన్నీ సిద్ధంచేసి

ఉంచేది. నళిని ప్రవర్తనలో మార్పు గమనించినప్పటికీ రామకృష్ణ చలించలేదు.

ఇల్లాగే పదిహేనురోజులు గడిచాయి. ఆ రోజున నళిని స్వయంగా వంటచేసింది. తనే స్వయంగా పిల్చి వడ్డించింది. రామకృష్ణ భోజనం ముగించుకొని చాప పరుచుకుని వరండాలో పడుకున్నాడు. నళిని రామకృష్ణ భోంచేసిన ఎంగిలివళ్ళెంకడిగి తాను భోంచేయకుండానేవచ్చి తన తండ్రి పంపిన పందిరి మంచంమీద పడుకుంది. వరండాలో చాపమీద పడుకున్న రామకృష్ణని చూచేసరికి నళినికి పందిరి మంచమంతా పల్లేరుకాయల మయమైనట్లుగా తోచింది. రామకృష్ణ తన కెందుకో దూరమైపోతున్నట్లుగా భయపడింది నళిని. నళిని తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడింది.

నళిని రామకృష్ణతో మాట్లాడడానికి ఎంత ప్రయత్నించినా రామకృష్ణ తప్పుకు తిరుగసాగాడు. తనను రెండు కొట్టినా తిట్టినా భరించగలిగేదేమోకాని నళిని యీ మౌనం మాత్రం భరించలేకపోయింది. తనకీ దండన ఎంతకాలమో ఆమె కర్థం కాలేదు. ఈ ఆలోచనలతో నళినికి దుఃఖం పొర్లుకొచ్చింది. మెత్తని తలగడ ఆమె వెచ్చని కన్నీటితో పూర్తిగా తడిసిపోయింది.

వరండాలో చాపమీద పడుకున్న రామకృష్ణ నళిని గురించే ఆలోచించసాగాడు. ఆమె మారిన తత్వం అతన్ని సంతోషపెట్టింది. ఈ ఆలోచనలతోనే యిద్దరికీ తెల్లవారింది. నళిని విశాలమైన నేత్రాలు ఎఱ్ఱగా ఉబ్బి భయంకరంగా ఉన్నాయి. నళిని ముఖంమీద విచారరేఖలు నాట్యమాడసాగాయి. ఆమెలో భర్తతో మాట్లాడాలన్న ఆతృత అధికమవసాగింది. నళిని పరిస్థితి చూచిన రామకృష్ణకి ఆమెమీద జాలి కలిగింది. అయినా తను మెత్తబడగూడదనుకున్నాడు.

నళిని భోజనంచేసి యిప్పటికి సరిగ్గా మూడురోజులు. రామకృష్ణకీవిషయం తెలిసినప్పటికీ తెలియనట్లుగా నటించాడు. నళినికి తన కర్తవ్యమేమిటో తెలియడంలా. తన భర్త తనవాడవాలంటే తనేం చేయాలి ?

ఒక రోజు రామకృష్ణ భోంచేస్తూంటే పెద్దతనం వెలగబెట్టూ వంట మనిషి అంది "అమ్మాయి నాలుగు రోజులనుండీ భోంచేయడంలేదు. ఇద్దరూ అల్లా ఎడముఖం పెడముఖంగా ఉంటే ఎల్లా నాయనా. ఎవరో ఒకరైనా సర్దుకు పోతూండాలిగాని." రామకృష్ణ మాట్లాడకుండా ఆ సంగతితనకేమీ పట్టనట్లుగానే గబగబాతిని వెళ్ళిపోయాడు. తలుపుచాటున నిలబడి యిదంతా వింటున్న నళిని పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

పున్నమి పండు వెన్నెలలో జగం మల్లె పూల దుప్పటి కప్పుకున్నట్లుగాఉంది. వెన్నెల కిరణాలు కొబ్బరి యీనలనుండి జారి ఆకుల చివర్లలో తళతళలాడు తున్నయ్. మాలతీ లతనుండి మాధుర్య గరిమతోకూడిన వాసనలు దొంతర్లు దొంతర్లుగా వస్తున్నయ్. సన్నని వెలుగు బారొకటి ఆకుల సందుగుండా వచ్చి రామకృష్ణ చాపమీద పడుతోంది. కొబ్బరి ఆకుల నీడలు నేలమీద తమాషాగా కదుల్తున్నయ్. ఈ ప్రకృతి రామకృష్ణ మనస్సుని కలవరపెట్టింది. తను ఊహించుకున్న నళినికి తన జీవితంలో ప్రవేశించిన నళినికి ఎంత భేదం. నిశ్చలమైన సరస్సులో చిన్న చేపల్లాగా ఉండే ఆమె కళ్లల్లో తళుకులు ముడుచుకున్న గులాబీమొగ్గలాఉన్న ఆమె పెదవులు, ఆ పెదవులమీద సన్నగా గర్వంగా తొడికిసలాడే చిరునవ్వు నళిని నుండి వేరుచేయలేవు. కాని ఆమె తత్వం ఎల్లాంటివారినైనా దూరం చేస్తుంది అని ఊహించుకుంటున్నాడు రామకృష్ణ. ఆ నిశ్శబ్ద వాతావరణానికి కొద్దిగా భంగం కలిగిస్తూ అతనికి సన్నని పదసవ్వడీ ఏడుపూ వినవచ్చాయి. మూసిన కన్నులు తెరచిచూచాడు. కాళ్లదగ్గర నళిని నిలబడిఉంది. రామకృష్ణ కాళ్ళమీద తలపెట్టి ఏడుస్తోంది నళిని. అతనికాళ్లు ఆమె వెచ్చని కన్నీటితోతడిసి చల్లబడ్డాయి. అతని హృదయం చలించింది. లేచి కాళ్లదగ్గరఉన్న నళినిని రెండు చేతులతోనూ చుట్టి 'యిప్పుడు నేనూహించిన నళిని నాకు దక్కింది' అనుకున్నాడు. నళిని తన ముఖాన్ని భర్త హృదయంలో దాచుకుని సన్నగా నవ్వుకుంది. ఆమె దుఃఖాశ్రువులు ఆనందబాష్పాలయ్యాయి.

దూరాన మామిడితోపులోనుంచి మత్తిల్లిన కోయిలకూత వినపడుతోంది.

---o---

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమినాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కేబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:




# రమణీస్

# బేబిగ్రైప్



తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెంసీస్ - విజయవాడ, సికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.

# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ ఏకమల్లి కామేశ్వరరావు

### ఏడు, దాని రెట్లు

పూర్వకాలంలో సంఖ్యల సంప్రదాయం విశేషంగా ఉండేది. ఒక్కొక్కజాతికే కాకుండ, ఒక్కొక్కజాతిలో ఒక్కొక్క కాలానికికూడ ఒక్కొక్క సంప్రదాయముండేదని చెప్పవచ్చు. మహాభారతంలోని పద్దెనిమిది అంకెయొక్క సంప్రదాయమిట్లుంది. పురాణాలు పద్దెనిమిది కాబట్టి మహాభారతం పద్దెనిమిది పర్వాలుగా విభజించబడింది. పద్దెనిమిది సైన్యాలు పద్దెనిమిది రోజులు యుద్ధం చేసేయి. యాదవశాఖలు పద్దెనిమిది. ప్రపంచకంలో పద్దెనిమిది దీవులున్నాయి. *

తెనుగు జానపద వాఙ్మయంలో ఏడు అంకెకు ఒక సంప్రదాయం ఏర్పడింది. తల్లి పసిపిల్లలకి చెప్పే చేపలకథ చూడండి. 'అనగా అనగా ఒక రాజు, ఆ రాజుకి ఏడుగురు కొడుకులు. ఆ ఏడుగురు కొడుకులు వేటకివెళ్లి ఏడుచేపలు తెచ్చేరు' అని ప్రారంభించేకథ ఎన్ని యుగాలక్రిందటిదో!

కాంభోజరాజు కథలో కాంభోజరాజు ఏడు మండలాలను పాలిస్తున్నాడు. అతనికి ఏడుగురు భార్యలు, ఏడుగురు కొడుకులు.

పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుడికి ఏడుగురు అన్నదమ్ములు. ఇట్లే ఏడుజాములు, ఏడువేలధనం ఇత్యాది ప్రయోగాలున్నాయి. మాంచాల బాలచంద్రుణ్ణి గురించి,

ఏడేండ్లనుండి తానే మారనట్టి
వేశ్యమోహంబు విడవనొనర్తు (పుట 63)

అంటుంది.

గాంధారికథ, కుమారరాముని కథ ఒక్కకవే రచించినట్టు ఆయా పుస్తకాలను చదివితే బోధపడుతుంది. ఈ రెండిటిలోకూడ ఏడు సంప్రదాయం మితిలేకుండ వాడబడింది. ఉదా:-కుమారరాముని కథలో రాజుకి ఏడుకోట్ల పదార్థముంది. వీరుడు ఏడు బారలుదూకి ఏనుగును చంపేడు (53).

సర్వాయి పాపడుకథలో ఏడుదున్నలు (13), ఏడుకొప్పెర్ల ధనం (13), ఏడుగడియల యుద్ధం (14) ఏడులొట్లకల్లు (9) ఇత్యాదులున్నాయి.

కాటమరాజు కథలో ఏడుగురన్నదమ్ములు (35), ఏడుతరాలు (101) ఇత్యాదులు కనబడుతున్నాయి.

కమ్మవారిపణతి పసులబాలరాజుకథలో ఏడు సంఖ్య విశేషంగా కనబడుతూంది. 'ఏడుమేడలు, ఏడు అడుగులు, ఏడు ఘడియలు' ఇత్యాదులు.

బాలనాగమ్మ ఆమె అప్పచెల్లెళ్లుకలిసి ఏడుగురు. ఆ ఏడుగురు అక్కచెల్లెళ్లు ఒకే తండ్రికి పుట్టిన ఏడుగురు అన్నదమ్ములను వివాహమాడేరు. దేశింగు రాజుకథలో ఢిల్లీ పాదుషా, బారాహజారి నెక్కలేని రాజులకు పద్దెని ఏళ్లు చెరసాలశిక్ష వేసేడు. చిన్నమ్మకథలో రాఘవరెడ్డికి ఏడుగురు కొడుకులు. చిన్నమ్మ ఏడుకుండల దొంతిలో మధ్యనున్న కుండలో దీపం పెట్టింది. బాలనాగమ్మకథలో తలారి రాముడికి ఏడుగురు కొడుకులు.

* Prof Hopkins's The great Epic of India లోని పు 371 నుంచి అనువాదం.

సన్యాసమ్మ కథలో ఈ శబ్ద ప్రయోగానికి మితి లేదు. సన్యాసమ్మకి ఏడుగురు అన్నదమ్ములు. ఆమె భర్త చెంచయ్య దొరగారి దగ్గిర ఏడు సంవత్సరాలు కొలువుచేసేడు. అత్త ఇంటిలో సన్యాసమ్మ చెయ్య వలసిన బండచాకిరీని అత్త, వదినెగార్లు ఎట్లాగు నిర్ణయించేరంటే —

ఏడు దొడ్లపేడ నీ వంతుపడెనే ఓ బాల !

ఏడుసావిళ్లకు దుడుపు నీవంతుపడెనే ఓ బాల

ఏడువాకిళ్ళకలాపి నీ వంతుపడెనే ఓ బాల !

♦ ♦ ♦

చంచయ్య మరణంవిని దొరలు—

ఏడు గడియలు వారు దుఃఖపోతారు-వారైన

(పుట 102)

సన్యాసమ్మని పరీక్ష చెయ్యడానికి దొరలు—

ఏడునీసపు పాత్రలను మరిగించుతారు (104)

పాపమ్మ సన్యాసమ్మ యొక్క దీనవైఖరిచూసి ఏడుగడియలు మూర్ఛపోయింది (108). సన్యాసమ్మ అత్తతో తాను ఏడు ఘడియలే ఉంటాననీ, ఆతర్వాత తన ఏడుకోట్ల ధనం ఏల వచ్చునీ చెప్పింది (110). అగ్ని గుండం ఏడుయోజనాలపొడుగు ప్రజ్వరిల్లింది (111).

పెద్ద బొబ్బిలిరాజుకథలో విజయరామరాజు రాగా బుస్సీదొర ఎదురు సేవ ఏడు అడుగులు వేసేడు (30).

బంగారు తిమ్మరాజుకథలో రంగసాని నాట్యమెట్లా చేసిందో చూడండి, 'నాలుగువందల పచ్చి కానలు అనించి, నాలుగువందల అరిటాకులు దొంతర పెట్టింది, పైన వడ్లగింజలు ఎత్తుగాపోసి వాటిమీద ఏడునూదులు దొంతిగా పెట్టించి, ఏడుగంతులు నాట్యమాడింది'. ఆ కథలోనె పెనుగొండ నేలేరాజు, అన్నదమ్ములుకలిసి ఏడుగురు. రఘుపతిమహారాజు గారు, ఆయన భార్య తిరపతికొండమీద ఏడేళ్లు తపస్సుచేసేరు. తిమ్మరాజు ప్రయాణాన్ని సూచిస్తూ ఎత్తిన ఎర్రజండా ఏడుఘడియలలో కూలిపోయింది. కాని దీనిలో రఘుపతిరాజుకి పదకొండుగురు రాణులున్నారని చెప్పబడింది. రాణుల సంఖ్య ఎక్కువయింది! ఎందుచేతో!

నల్లతంగాళ్ కి ఏడుగురు బిడ్డలు.

దేశింగురాజుకథలో శూరసింగు చెంజికోటనువిడిచి వెళ్ళిన ఏడురోజులకు దేశింగు జన్మించేడు.

పల్నాటి వీరచరిత్రకథలో కోడిపందేలలో ఎవరు ఓడిపోతేవారు ఏడు సంవత్సరాలు వలసలకి పోవాలి అనే ఒప్పందం నాయకురాలేర్పరిచింది.



జమినీవారి 'అవ్వయార్'లో నొక దృశ్యము.

మన పురాణాలలో చెప్పబడే ఏడు సముద్రాలు అన్నది ఒక సంప్రదాయం మాత్రమే అని తోస్తూంది. పైగా ఇవి నేతి సముద్రం, పాల సముద్రం అని చెప్పడంలో అది ఒక సంప్రదాయం అనేది ద్రువపడుతూంది. సంతానార్థమై స్త్రీలు సప్తసాగర యాత్రలు చేస్తారు. పిల్లి పిల్లలనుపెట్టి ఏడు ఇళ్లు తిప్పుతుంది అని వాడుక.

ఏడునుబట్టి దానియొక్క రెట్టకికూడ సంప్రదాయమేర్పడింది.

చిన్నమ్మ ఏడుదొంతుల కుండలలో నడికుండలో ఏడు ఏడు పద్నాలుగు ఏళ్లపాటు ఒక్కటే దీపం ఉందిట! (పుట 7) ఏడు ఏడు పద్నాలుగు జన్మలు అనే తెలుగు జాతీయ మొకటి వాడుకలోఉంది. ఉదా:-అతను ఏడు ఏడు పద్నాలుగు జన్మలలో కూడ మంచిపనిచేసి ఎరగడు అంటారు. సన్యాసమ్మకథలో పద్నాలుగుకోట్లనిండా ధనముంది!

పన్నెండు, దానిరెట్లు

కాంభోజరాజుకథలో కాంభోజరాజుకి పన్నెండు ఘటల ఏనుగులున్నాయి.

పల్నాటి వీరచరిత్రలో ఐతమ్మకి పన్నెండేళ్లపాటు సంతానంలేదు.

గాంధారికథ కుమారరామునికథ ఒక రచయితే వ్రాసేడు. గాంధారికథలో పన్నెండు సంప్రదాయం విశేషంగా ఉంది.

కుమారరామునికథలో అరణ్యం పన్నెండామడ పొడుగుంది, గుర్రానికి పన్నెండు సేర్లపాలు పెట్టేరు (54). పన్నెండుగురు భటులతో యుద్ధంచేసేడు (62).

సర్వాయి పాపడికథలో పన్నెండు శిరస్సుల నాగుబాము వస్తుంది. అల్లే అతని నేస్తులు పన్నెండుగురు.

కాటమరాజుకథ సుమారుగా పదిహేడో శతాబ్దాంతమందు రచించబడడంచేత, ఇతర కారణాల వల్ల, ఈ అంకె ఒక్కచోట మాత్రమే (పన్నిద్దరు దళవాయిలు అని (123) కనబడుతూంది.

కమ్మవారిపణతి పనుల బాలరాజు కథలో పన్నెండు సంఖ్య మితంగా మాత్రమే ఉంది.

బాలనాగమ్మకథలో వచ్చిన మూడుపాములకు పన్నెండేసి తలలున్నాయి. నల్లతంగాళ్ కథలో మూడేవి పన్నెండేళ్ళ పాతమూరికి రాగులను వదినెకు, పిల్లలకు వంటచేసి పెడుతుంది (23).

దేశింగురాజుకథలో చెంజి దుర్గాధిపతులు పన్నెండేళ్లనుంచి కిస్తీ కట్టలేదు.

బొబ్బిలిపాటలో పల్లకీబోయీలు పన్నెండు మంది. రంగారావు పన్నెండుమంది తెలగవీరులను పీరలెట్టుకి పంపేడు (34) వెంగళరాయుడు పన్నెండేళ్లపాటు సాముచేసేడు (45). ఒక్కొక్క సైనికుడికి పన్నెండేసి ఆయుధాలుంటాయి (51), గుర్రాన్ని పన్నెండుమంది కాపుదార్లు తెచ్చేరు (51). పన్నెండేళ్లు యుద్ధంచేసినా బొబ్బిలికోటను గెలవలేము అంటాడు దుబాసి లక్ష్మయ్య.

సన్యాసమ్మకథలో ఆమె పన్నెండేళ్లపాటు వ్రతం తలపెట్టింది. ఆకథలోనె దొరగారు పన్నెండేళ్ల కిందట సముద్రంలోపడి చనిపోయిన తన కొడుకును బతికించమని సన్యాసమ్మని అడుగుతాడు. పల్లకీబోయీలు పన్నెండుగురు (101). చెంచయ్యకి జాతివారి కొలువులో పన్నెండు వరహాల జీతం.

జానపద కథలలో పన్నెండు సంప్రదాయం ఎంత బలమైనదో ఈకింది అంశాన్నిబట్టి తెలుసుకోవచ్చు. బొమ్మెరపోతన్న ఆంధ్ర భాగవతంలో కాళియమర్దన ఘట్టంలో కాళింగుడికి నూరు తలలున్నాయని వ్రాసేడు. కాళింగుపాట వ్రాసిన జానపదకవి ఆంధ్ర భాగవతంలోనికథను అనుసరించినా కాళింగుడికి పన్నెండు శిరస్సులే అని మాత్రమే తెలియజేసేడు. ఈ అంకె నోములు, స్త్రీల పాటలతో కూడ వస్తూంటుంది.

పన్నెండుయొక్క కట్టుకూడ ప్రసిద్ధిఉంది. కామమ్మకథలో మారయ్య ఇరవైనాలుగు బోయీల మీద పెద్ద. కుమార రాముని తల్లికి 24 ఏళ్లు సంతానం లేదు. అట్లే గాంధారి తల్లికికూడ.

సర్వాయిపాపడిదండు పన్నెండువేలు. రంగ సాని పన్నెండువేల సైన్యాన్ని తీసుకొని బంగారు తిమ్మరాజుమీదికి దండెత్తింది. అట్లే నారప్ప కూడాను. తిమ్మరాజు సైన్యంకూడ పన్నెండువేలే! విజయరామరాజు ఇరవైనాలుగువేల సైన్యంతో యుద్ధానికి బయలుదేరేడు.

## కొన్ని ఇతర అంకెలు

బంగారు తిమ్మరాజుకథలో అన్నదమ్ములందరూ కలిసి ముగ్గురు. సన్యాసమ్మకథలో భర్తయైన చెంచయ్య. అన్నదమ్ములుకలిసి ముగ్గురు.

పల్నాటి వీరచరిత్రలో వీరులంతా అరవైయొదు గురు కాబోలు.

కాంభోజరాజుకథలో విద్యలన్నీకలిపి ముప్పై మూడు అని ఉంది. కుమార రాముడికథలో ముప్పై మూడు అంకె తరుచు వస్తుంది.

బొబ్బిలికథలో ఒక్కొక్క వెలమపాలెయగాడి కింద ఏభై ముగ్గురు వెలమవీరులున్నారు.

సన్యాసమ్మకథలోని చెంచయ్యకి నెలకి బత్తెం అయిదు వరహాలు. కామమ్మకథలోకూడ నెలకి జీతం అయిదు వరహాలు. బంగారు తిమ్మరాజు కథలో తిమ్మరాజుయొక్క భార్యలు పదకొండుగు రట! కాంభోజరాజుకథలో రాజుగారికుండే గుర్రపుదళం ఒక లక్ష. బుస్సీదొర లక్షతొంభై వేల దళంతో యుద్ధానికి బయలుదేరేడు. ఈ రక మైన అంకెలు కొన్ని విడివిడిగా వస్తాయి.

## అతిలోకపు టంకాలు, అతిశయోక్తులు, వాటి ప్రభావం

జంగంకథలో వీరుడు పరమాద్భుతమైన అసాధారణ మనిషిగా ఉండాలనే నియమంవల్ల రచన యథార్థతయే దూరమయిపోయింది. ఇది ఒక్కొక్క ప్పుడు ఇది గంధర్వకథ కాబోలు అనిపించేటంత అసహజంగాకూడ కనబడుతుంది. పాతదైన కాంభోజ రాజుకథలోను, అది ఒరవడియైన బాలనాగమ్మకథ లోను గాకుండ, చారిత్రకమైన పల్నాటి వీరచరిత్రలో కూడ కొన్ని పట్టులలో నిజంకాదేమో అనిపిస్తుంది. బ్రహ్మనాయుడు విషంతిన్నా చావడు. బాల చంద్రుడి మెడమీద కత్తిపడగా ఆ కత్తి పిండి పిండయి పోయింది. చచ్చిన భటులమీద కుమార రాముడు మంత్రజలం చల్లగా వారు బతుకుతారు.

కాటమరాజుకథ అద్భుతాలకు అతిశయోక్తులకు పుట్టిల్లయింది. మహావిష్ణువు బొల్లావు రూపాన్ని వచ్చేడు. ఆ మహావిష్ణువుయొక్క అవతారమే కాటమరాజు. జాంబువంతుని అవతారం బీరన్న. దీనిలో అద్భుతమైన కత్తి, కుంకం ఉన్నాయి. కత్తిని ప్రార్థించగా అది ఎగిరివచ్చి భుజంమీదపడు తుంది. ఆవులు, ఎద్దులు యుద్ధంలో అతి తీవ్రంగా పాల్గొంటాయి. ఇట్లాంటి చిత్రాలు ఎన్నో ఉన్నాయి. కవి దీనినొక పురాణంలాగు తయారు చేసిపెట్టేడు.

ఈ సంప్రదాయంలోని అసహజత్వాన్ని కవులు గ్రహించేటప్పటికి చాలకాలం పట్టింది. కాబట్టి పెద్ద బొబ్బిలిరాజుకథ కాలంనాటికి ఇవి – ఆ కథ చారిత్రకంకదా – చాలవరకు తగ్గేయనే చెప్పవలసి వస్తుంది. ఆటు తర్వాత ఇది కొంతవరకు కవినిబట్టి పోతూవచ్చింది.

కమ్మవారిపణలి పసుల బాలరాజుకథలోని అద్భు తాలు దానిని గంధర్వకథగా చేసేయని చెప్పవచ్చు.

మరొక రకమైన సాంఘిక కథ కవులపాలిటి కల్పవృక్షమయింది. అదేదంటే సహగమనకథ. కుంఫిణీ పరిపాలకులు మహిమాన్వితులైన స్త్రీలకే గాని సహగమనానికి అనుజ్ఞ ఇచ్చేవారు కారుట! స్త్రీలలోఉండే ఆధ్యాత్మిక శక్తి విజృంభించింది. వారు అనేక మహిమలను చూపసాగారు; కల్పించ వలసిన బాధ్యత కవులకు వదలింది.

(సశేషం)

# అనుమానం!

శ్రీమతి వజ్ఝల లక్ష్మీనరసమ్మ

"ఇంకా వంటయిందాలేదా?" అన్నాడు వెంకట్రావు.

"అయింది. మీరు స్నానం చేయండి" అంది రమణమ్మ.

భోజనంచేస్తూవుండగా, వీధి తలుపు చప్పుడయింది. రమణమ్మలేచి తలుపు తీసింది. పొరుగు కృష్ణారావు కనిపించి "ఏం చెల్లెమ్మా? బావగారి భోజనం అవుతున్నదా" అన్నాడు.

"రావోయి కృష్ణా! కూర్చో" అని కేకవేశాడు వెంకట్రావు - మనసులో విసుక్కుంటూ, అయిష్టతతో.

గోడ గడియారం పదిగంటలు కొట్టింది. "వృత్తినే వచ్చానోయ్! నాకూ టైము యింది. వెళ్తాను" అంటూ కృష్ణారావు వెళ్లిపోయాడు.

వెంకట్రావు భార్యమీద రుసరుసలు ఆడుతూనే భోజనం ముగించాడు .... ...

♦ ♦ ♦

కృష్ణారావు యింటికివచ్చి, సుబ్బలక్ష్మితో "వేగిరం భోజనం వడ్డించు" అన్నాడు.

"మీకు భోజనం ఎందుకండీ! ఆ రమణమ్మ ముఖం చూస్తూ కూచుంటే చాలదూ?" అంది సుబ్బలక్ష్మి వెటకారంగా.

"ఛీ! వూరుకో! సోదర ప్రేమతో మేము ఒకరినొకరం చూచుకుంటున్నాము. అలా అనడం తప్పు!"

"ఓహోహో! మీ సోదర ప్రేమలు నాకు తెలుసులెండి! పైకి పటారం, లోన లొటారం."

♦ ♦ ♦

ఈ రెండు కుటుంబాల సంగతి ఇలా వున్నది. వెంకట్రావుకి భార్యమీద అనుమానం! సుబ్బలక్ష్మికి భర్తపై అనుమానం.

ఇలావుండగా, ఓనాడు — రమణమ్మ పండుగకని తన పుట్టింటికి వెళ్లింది. వెంకట్రావుకి మనస్సు హాయిగావుంది! ఇవతల సుబ్బలక్ష్మి మనస్సుకూడా కొంత తేలిక అయినట్లుంది. వెంకట్రావు, కృష్ణారావుల స్నేహం సాఫీగానే నడుస్తున్నది.

ఒక వారం గడిచింది. పొరుగూరిలో తన తమ్ముడివద్దకి ఏదోపనిమీద వెళ్ల వలసివచ్చింది కృష్ణారావుకి! అంచేత "ఒసే, రేపు పుదయం 5 గంటలకే కాఫీ చేయాలి'' అన్నాడు భార్యతో.

వచ్చిన చిక్కేమిటంటే, ఆ పొరుగూరే రమణమ్మ పుట్టిల్లు! దీంతో సుబ్బలక్ష్మికి అనుమానం ఎక్కువైంది!

''మీ పనులు ఏమిటో నాకు తెలుసు! ఈ వారం రోజులూ, ఆవిడగారు లేకపోవడం వల్ల మీరుండలేకపోయారు!'' అంది ఆమె!

ఏమైనా కృష్ణారావు వెళ్లిపోయాడు.

ఆ మర్నాడు నూతి దగ్గర సుబ్బలక్ష్మి నీళ్లు తోడుతూ వుండగా వెంకట్రావు వచ్చాడు.

''కృష్ణ ఈ మధ్య కనిపించడంలేదేం'' అన్నాడు వెంకట్రావు.

''మీ ఆవిడ పుట్టింటారి వూరు వెళ్లేరు! అక్కడ మా మరిదిగారువున్నారులెండి'' అంది సుబ్బలక్ష్మి ఏదో సూచనగా!

వెంకట్రావు వూరుకున్నాడు. ఇద్దరూ ఏదో ఆలోచించుకుంటూ చాలా సేపటి వరకూ అట్లానే వుండిపోయారు. ఇద్దరికీ అనుమానాలువున్న సంగతి ఇద్దరికీ తెలుసును. ముఖచిహ్నాలనుబట్టి ఒకరి ఆలోచనలు రెండోవారు సులువుగానే గ్రహించుకోగలిగారు! వెంకట్రావుకి కోపంతో వళ్లు మండిపోతున్నది. దీనికి ఏదో వుపాయంచేస్తేకాని లాభంలేదనుకున్నాడు!

''ఏం చెల్లెమ్మా! ఏమిటాలోచిస్తున్నావు''

''మావారెందుకు వూరు వెళ్ళారా అని!''

''ఔను! నేనూ అదే అనుమానిస్తున్నాను'' అని వెంకట్రావు తన అనుమానం వ్యక్తంచేశాడు.

సుబ్బలక్ష్మికి కళ్లంట నీళ్లు వచ్చాయి. ఆమె అంది ''నాబ్రతుకు యిట్లా అయింది. నా ఖర్మ!''

''చెల్లెమ్మా! వూరుకో! నీ భయం నాకు తెలుసు. నా భయమూ నీకు తెలుసు! దీనికేదైనా వుపాయం మనం ఆలోచించాలి.''

సుబ్బలక్ష్మి వుత్సాహంతో ''ఔను అన్నగారూ! మీరేదైనా వుపాయం ఆలోచించి నా బ్రతుకు బాగుచేయండి'' అంది.

''నా బ్రతుకు కూడాను!'' అన్నాడు వెంకట్రావు. ఇద్దరూ ప్లాను వేశారు. ఏమంటే:—

సుబ్బులక్ష్మి పుట్టింటికి వెళ్లినట్లు మొగుడికి వుత్తరం రాయించి, తను మాత్రం నిజానికి ఎదురింట్లో దాగోడం — వెంకట్రావు కూడా తన పెళ్ళానికి 'తను ఏదో ఆఫీసు పనిమీద పొరుగూరు వెళ్తాన'ని రాయించి, నిజానికి పొరుగింటి స్టూడెంట్ల లాడ్జిలో తల దాచుకోడం — ఇదీ ప్లాను! ఈ విధంగా కృష్ణారావు రవణమ్మల ప్రణయకలాపం కనిపెట్టడానికి నిశ్చయించుకున్నారు!

ప్లాను ప్రకారం వుత్తరాలు వెళ్లేయి. ఇళ్లు తాళాలు వేయబడ్డాయి! తాళం చెవులు ఇంటి అధికారుల కిచ్చేరు.

రెండు రోజులు గడిచాయి. ఆ నాటి వుదయం కృష్ణారావువచ్చి, ఇంటివారి దగ్గర తాళాలు పుచ్చుకుని ఇంట్లోకి వెళ్లేడు. పెళ్లాం ఇంత తొందరగా పుట్టింటి కెందుకు వెళ్లిందో! అనుకున్నాడు. ఆ నాటి సాయంత్రం రవణమ్మకూడా పుట్టింటినించి వచ్చేసింది. మొగుడుకి ఎప్పుడూ లేనిది వూరు వెళ్లవలసిన అవసరం ఎట్లా కలిగిందా అని ఆశ్చర్యపడ్డది.

ఇవతల వెంకట్రావు, సుబ్బలక్ష్మి అతి మెలకువతో "నేరస్తులను" కనిపెడుతున్నారు. రాత్రి ఎనిమిదయింది. ఆ వేళ అమావాస్య. చిట్టచీకటి! "ఇది వాళ్ళ అదృష్టం! మా దురదృష్టం" అని అనుకున్నారు డిటెక్టివులు!

రాత్రి 10 గంటలైంది! ఎవరో వ్యక్తి సరిగ్గా కృష్ణారావులాగే వున్నాడు - వరండాలో మెసలుతున్నట్లయింది. మరింకేం! వాడే! రమణమ్మ గదిలోకి దూరడానికి చూస్తున్నట్లుంది అనుకున్నారు డిటెక్టివులు! కాని కటిక చీకటి! ఏదీ సరిగ్గా కనపడటం లేదు. పావుగంట దాటింది. వెంకట్రావు తన రహస్య స్థలంనుంచి సుబ్బలక్ష్మి దాగున్న చోటికివచ్చి రహస్యంగా "చెల్లెమ్మా! దొంగలు దొరికారు. వేగిరం రా! మనిద్దరం మా యింటి వరండాలో నించుని 'దొంగలు, దొంగలు' అని అరుద్దాం, అందరూ వస్తారు!" అన్నాడు. ఆమె వచ్చింది.

ఇద్దరూ వరండావద్దకువచ్చి ఇటు అటూ చూసి గట్టిగా 'దొంగలు దొంగలు' అని అరవ ప్రారంభించారు. 2 నిమిషాల్లో రెండు డజన్లమంది పరుగెత్తుకునివచ్చి వరండాలో గుమికూడేరు.

"ఎక్కడున్నారు దొంగలు" అన్నారొకరు.

"ఆ యింట్లో" అని వెంకటరావు తన ఇంటివేపు చూపించాడు!

అందరూ ఆ యింటి తలుపులు బాదడం మొదలు పెట్టేరు. ఇంతలో భయంతో వణకుతూ రమణమ్మ తలుపులు తెరిచి బావురుమంది! వెంకట్రావు గబగబా లోప

లికివెళ్లి ఇల్లు అంతా వెతికి పైకివచ్చి సుబ్బలక్ష్మితో మెల్లిగా "అదొక్కర్తే వున్నట్లుంది" అన్నాడు. ఇంతలో ఆ పక్కవాటాగదితలుపు తెరువబడింది. సుబ్బులు, వెంకట్రావు పక్కకి చూశారు! కృష్ణారావు తన గదిలోంచి కళ్లు నులుము కుంటూ అప్పుడే బైటకివచ్చి "ఏమే సుబ్బులూ! నువ్వు ఎప్పుడు వచ్చావు" అన్నాడు వింతగా. చీకట్లో యింతవరకూ తన భర్తని గుర్తుపట్టలేని రమణమ్మ ఇప్పుడు గుర్తుపట్టి "ఏమండీ! ఏమిటీ సంగతి? ఎప్పుడొచ్చారు? ఏవూరెళ్లేరు" అంది.

"ఏవూరూ లేదు. అతను, సుబ్బులమ్మా ఇక్కడే ఎదురింట్లో దాగున్నారు" అని ఎదురింటి కుర్రాడు నవ్వుకుంటూ పారిపోయాడు. అందరూ విస్తుపోయారు.

వెంకట్రావు, సుబ్బులక్ష్మి కొయ్యబొమ్మల్లా ఒకరినొకరు చూచుకుంటూ అట్లానే నించుండిపోయారు కళ్లుమిటకరించి!!



తన్మయత

# పింగళి సూరనగారి - శుచిముఖి

శ్రీ మిక్కిలినేని నరసింహులు

కవుల కల్పనాచాతుర్యము కల్పతరువు వంటిది. ప్రతికావ్యమందును, ప్రతి ప్రబంధమందును కొంతకల్పనాచాతుర్యము కన్పించుచునేయుండును. కల్పనలేనిదే కవి యొక్క యద్భుతయూహలను నరయజాలము. ఇట్టి కల్పనలు చతురుఁడైన కవికే సాధ్యమగును. ప్రతికవికిని యీ కల్పనలు నలవడవు. ప్రతికవియును నొకగుణమును ప్రాధాన్యముగాఁ దీసుకొనును. ఇట్టి కవులలో మనపింగళి సూరనగారొకరు. వీరు కల్పనా చాతుర్యమను గుణమును ప్రధానముగా తీసికొనిరి. సూరనగారు కల్పనలందు ప్రసిద్ధులు. ఇదివఱకే తన కళాపూర్ణోదయమునుండి 'కలభాషిణి కల్పన'మని పి. వి. హానుమంతరావుగారు నేర్పరచియున్నారు. ఇతని కల్పన మనన్యసాధారణమైనది. కలభాషిణివలెనే ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖి పాత్రను గల్పించినాడు.

ఈ శుచిముఖి హంసరమణి తనతోడి వారితోఁగూడి ప్రతిదివసమును వజ్రనాభుఁడను రాక్షసుని పట్టణమందుగలకొలనులందు విహారము సలుపుచుండును. ఈమె దేవకార్యమునకుఁ దోడ్పడి పాఠకులకు తన ఘనతను వెల్లడించినది. తనచతురతను తరచి చూపినది. ప్రభావతీ ప్రద్యుమ్నులకు దౌత్యము సలుప ధృవపఱచుకొన్నది. వజ్రనాభుని సంహారమునకును సురరాజుయభీష్ట సిద్ధికిని తన చతురతను వినియోగించెను. దేవేంద్రుఁడు హంసలన్నిటిఁబిలిపించి వజ్రనాభుని మర్ధించుయత్నంబును, దత్పురియందలి జరుగు రహస్య విశేషంబుల నెఱుక పఱచమని దెలిపెను.

ఆ సందర్భమున దేవేంద్రునికి సమాధానము నివ్వ పింగళి సూరనగారు శుచిముఖిని నేర్పాటు జేసెను. ఆడు హంసలకు గల బుద్ధిని రెట్టింపజేసెను. శుచిముఖి నాధుఁడు సమాధానమియ్యలేక శుచిముఖినే సమాధానమిమ్మనెను. ఇచ్చట పింగళి సూరనగారు

> "స్త్రీణాంద్విగుణ మాహారం, బుద్ధిశ్చాపిచతుర్గుణా
> సాహసంషడ్గుణంచైవ, కామోష్టగుణ ఉచ్యతే"

యను సుభాషితముఁదలపింపజేసెను. మరాళవల్లభుఁడు చతురుఁడు కానందునసే శుచిముఖిని నిర్మించెను. శుచిముఖి కలతెఱంగంతయు సురవల్లభునకు నివేదిం

చెను. ప్రభావతికి ప్రద్యుమ్నుని చిత్రపటము లభించిన తెఱంగెరింగించి కథకు బీజము నాటెను. ఈ బీజమును బెంచుటకు సూరనగారి శుచిముఖికి వజ్రనాభుని పట్టణకొలంకులు విహారభూములు కావలసివచ్చెను. విచ్చలవిడిగా కేళికా సదనములందు విహరించెను. మన సూరనగారి కల్పన మనన్యమైనదని, నిదివఱకే నుడివియున్నాను.

శుచిముఖి, కేవలమరాళిగాదు. కేవలమరాళము మనసూరనగారి యిష్టసిద్ధిని నెరవేర్చలేదు. అందులకే యతను వాగ్దేవత నింటియందలి దానినిగాఁదీసికొనియెను. దేవరాజునకు వజ్రనాభునివృత్తాంతముఁ దెలిపినది శుచిముఖి. దేవేంద్రునియాశ్చర్యచకితుని జేసినది. ఒక్కతూరి యతని వీనులకు విందుఁగలుగఁజేసెను. ఇట్టి హంసరమణి యెచ్చోటుదయి యుండవచ్చునను యూహాఁబొడమించెను. ఇప్పట్టుల శుచిముఖి

"శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక, పదమైత్రి యర్థసంపదలఁబొదలఁ
దలఁపెల్లనక్లిష్ట తను బ్రదీపితముగాఁ బునరుక్తి దోషంబుపొంత బోక,
యాకాంక్షితస్ఫూర్తియాచరించుచునుశా, ఖాచంక్రమక్రియఁగడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాడుకోనదుపచు, నుపపత్తియెందునత్యూర్జితముగ
నొకటఁబూర్వోత్తర విరోధమొందకుండ
దత్తదవయవవాక్య తాత్పర్యభేదములు మహాకావ్య తాత్పర్యమునకునొనరఁ"

బలికినది. దేవేంద్రుఁడిట్టి విద్యానిపుణతకు బహుతపః ఫలముగాదెలియని కొనియాడినాఁడు. అప్పటికే సహస్రాక్షునికి మనకార్యము సిద్ధింపఁగలదని నమ్మకము గలిగెను. శుచిముఖి ప్రౌఢిత్వమును పారజూచినాఁడు. తుదకు శుచిముఖినిఁ బలంచి

"నీ వెవ్వరి కొలదియుగా, వోవరటామణి విహంగయోష వెభాషా
ప్రావీణ్యముచూడఁగవా, గ్దేవతవో కాకయాక్క దిద్దినకవివో"

యని స్తుతించినాఁడు. నిజమే వాగ్దేవత దిద్దినకవిగానియెడల నిట్టిభాషా ప్రావీణ్యము నెట్లు సమకూరును. ఇట్టి భాషా ప్రావీణ్యము, నిట్టిచతురతలేనిదే మన సూరనగారికి పనికివచ్చునా! పనికిరాదు. కార్యభారమునుజూచి సూరనగారు పాత్రను గల్పించుచుండును. ఇచ్చట సాధారణమయిన కార్యము కాబట్టి, వాగ్దేవత దిద్దిన కవిని నిర్మించినాఁడు. వాణిచేతి నేర్పుల కుప్పకాబట్టియే శుచిముఖి

"వినుసురేంద్ర పద్మజుని తేరుదివుచుసా, రంధ రాఖ్యుఁడగుమరాళవిభుని
బిడ్డనేను వాణి పెనుపంగఁ బెరిగిత, ద్విమలశిక్షఁ గంటివిద్యనెల్ల"

యని దేవేంద్రునెదుట చాటినది. ఇప్పట్టుల వాణి శుచిముఖులకుఁగల స్నేహమును జూచిన నింతులపొత్తు వ్యక్తమగుచున్నది. వాణి తన సహపాటియగు శ్రీహంసకే విద్యలు నేర్పించెను. పాపము హంసవల్లభునికి నేర్పలేదు. మానవజాతియందుగూడ నింతుల పొత్తులు పక్షపాతములై యుండును. లేనియెడల సూరనగారు, వాణి శుచిముఖులకు నింతటి స్నేహమును జూపియుండడు. శుచిముఖి విద్యానిపుణత, బృహస్పతినంతటి గురువు కలిగిన యింద్రునికే నాశ్చర్యము కలిగించినది. తదితరులకుఁ జెప్పవలయునా ?

శుచిముఖి విశదపక్షపాతి. అందుకే దేవేంద్రుఁడు కార్యసాఫల్యమగునని నమ్మియుండెను. కృష్ణుని చెంతకేతెంచెను. శుచిముఖి కన్నతల్లుల ప్రేమ నెఱింగినదగుటచే రుక్మిణి యెదుట నీ విషయము నివేదించిన ప్రద్యుమ్ననంపుటకు నొల్లదని దెలిసికొనియెను. కృష్ణుని నేకాంత ప్రదేశమునకు రమ్మని యున్నవిషయముల నెఱింగించెను. ప్రద్యుమ్న నంపుటకు సమ్మతింపజేసెను. కృష్ణునితో సంబంధమును సంపాదించెను. కృష్ణుని వీడ్కొని వజ్రనాభు పురమునకరుగుదేరెను. దారిలో గుఱ్ఱపుస్వారిఁ జేయుచున్న ప్రద్యుమ్నుని గాంచెను. ఇదియే తగుసమయమని ప్రద్యుమ్నుని చెంతకేతెంచెను. కలతెఱం గెరింగించెను. ప్రభావతీ రూపమును కన్నుల గట్టినట్లు చిత్రించెను. నిశ్చేష్టునిజేసెను. ముగ్ధుని గావించెను. మారాడ నోరురాక మదిఁ గుందించెను. ప్రభావతీ ప్రతి యవయవమును వర్ణించెను. ఇది కలగాదు సుమాయని హెచ్చరించెను. నేను సరస్వతీ సతినని నెరింగించెను. వాణి చెంత విద్యనేర్చి మన్ముఖంబు శబ్ద సంస్కార పూతంబను బుద్ధి నద్దేవి నాకు శుచిముఖియని పేరిడెనని దెలిపెను. ఉపమాతిశయోక్తి కామధేను బిరుదమిచ్చి తల్లిఖితనూపురమంఘ్రి దొడగిన విధముఁ జెప్పెను. అద్దానిని ప్రద్యుమ్ననికిజూపి తన చతురతనుజూపి కుతుకమొందించెను. అటవీడ్కొని వజ్రనాభపుర కన్యాంత సరోవరముజేరెను.

అంతట శుచిముఖి తరికివేచియుండెను. ప్రభావతీ చెలికత్తెలిరువురు ప్రద్యుమ్నుని చిత్రపటముఁజూచి విలపించుచుండ, నిదియే తరియని శుచిముఖి బయలుపడినది. పాపము ప్రద్యుమ్నుఁడు శుచిముఖి పలికినపుడు మారాడకుండెను. మరల, నేను విముఖుఁడనని శుచిముఖి నా ప్రస్తావన తలపెట్టదేమోయని చింతిల్లెను. శుచిముఖిమాత్ర మట్లుచేయలేదు. ఇంగిత జ్ఞాన మెరింగినదిగాన ప్రభావతికరమందలి చిత్రమునుజూచి

దీని కనుపైన నొక పురుషుని జూచితినని ప్రద్యుమ్నుని జన్మముఁ దరింపజేయ సమకట్టెను. నిజముగా నిట్టి రూపవంతుఁడున్నాఁడా జెప్పుము. మేమిరువురమున్నాఁడు లేఁడని పందెములు వైచికొనియున్నవారమని ప్రభావతి చెలికత్తె లిరువురడిగిన సందర్భమున నెంతచతురతఁ బ్రకటించెనో చూడుఁడు.

"...పందెముకొఱకై; నను వేఱొకపనికినైన నాకది తెలియం
బనికలదె మీకునాచే, వినవలసిన యర్థమరసి వినుపింతుదగన్"

యని పందెము కొఱకేనా లేక వేఱొక కారణమున "అనగా వివాహముఁ జేసికొనుటకా" యని వ్యంగ్యముగా చతురతను బ్రకటించెను. ఆ చిత్రమును ప్రద్యుమ్నుడని కొన్ని గురుతులుఁజూపి, యీ గురుతులఁగూడ రచించినారే! యని ధృవపరచినది. అతని వృత్తాంతమును దెలుపుమనివేడిన కన్యలకు కొంత బిగువుఁ జూపినది. ఈ రహస్య విచారము విఘ్నమయిన తరువాత నీమది కసూయకలుగునని జెప్పెను. కాన, పోయివచ్చెదనని తనదిటవు తనమును తరచిచూపినది. తుదకు "అంతిపురంబు కన్యలట, ఆత్మ తెఱంగభితాప్రయుక్తి నొక్కింతయు నేర్పరింపరట" యని యువస్తుతుల్ బ్రపంచింప జంకుచుంటిని, కాన నిప్పుడు తెల్పెద వినుఁడని ప్రద్యుమ్నుని వృత్తాంతమంతయుఁ దెలిపెను. ప్రద్యుమ్నుని గుణగణములఁ బొగడెను. ప్రభావతిని మైమరపింపజేసెను. ప్రభావతిని దెలిపినపుడు ప్రద్యుమ్నుఁడు మారాడకుండెనని దెలిపెను. అందులకు ప్రభావతి చింతాక్రాంతయయ్యెను. ఆ సందర్భమున శుచిముఖి నద్దేవినిజూచి ప్రద్యుమ్నుఁడొల్లఁడు నింకేవరునైన గోరుకొనుము. తత్క్షణమే నీ యభీష్టమును నెరవేర్చగలనని తన చతురతను బ్రకటించెను.

బ్రహ్మకును వాణికిని పొలయలుకఁ దీర్చునది శుచిముఖి. ఇక ప్రభావతీ ప్రద్యుమ్నుల నొకటిగా జేకూర్చుట నొకచిత్రమా! బ్రహ్మకును వాణికినిగలిగిన పొలయములు కలఁదెలిపినది. నద్దానివారింప తానే కారకురాలైనదిన్ని, ఆ సమయమున బ్రహ్మవిరహబాధ కోర్చుకొనలేక మన్మధుని భూషించి యిట్టిబాధలు నీకుగూడ ప్రభావతివలన కలుగునని తెలిపిన విషయమును వ్యక్తపఱచెను. దానివలన నేదియో మది యోజన సేయుచు ప్రద్యుమ్నుఁడప్పుడు మారాడకుండెను. ఇప్పుడు మిమ్మలిరువురిని నేకూర్పగలనని శుచిముఖి ప్రభావతి నోదార్చెను. సమీపమున ప్రద్యుమ్నుని లేఖఁగొని వచ్చిన చిలుకనుజూచి వెంటనంటెను. ఆచిలుకనుబట్టికొని పత్రిక చందంబును చంద్రవతీ గుణవతుల గుట్టునెఱింగి సంతోషమందెను. వారికిని మీపత్నులతో మిమ్ములఁ జేర్చగలనని

ముదముఁగొలిపెను. ప్రభావతీ సహాయమువలన వజ్రనాభు ననుమతిమీఁద సభ కేగెను. అచ్చట తనవచో నిపుణత్వముఁజూపి వజ్రనాభుని సంతోషపఱచెను. తన కార్యసాధనకై ప్రఖ్యాతివడసిన భద్రనామధేయనటునిగూర్చి జెప్పెను. యాతనియందాసక్తి బుట్టించెను. ఆ నటునితోడి తెచ్చుటకు నొప్పుకొనెను. అంతట ద్వారక కేతెంచి కృష్ణుని కంతయు నివేదించెను. ప్రద్యుమ్ననికి ప్రభావతిని వడయుప్రయత్నంబును ఫలింపజేసెను. ప్రభావతి విరహమును ప్రతిఫలింపజేసెను. ప్రద్యుమ్ననికి ప్రభావతి నెప్పుడు చేరుదునోయను నాసక్తి బుట్టించెను. వజ్రనాభునివధకును, నీ కార్య సాఫల్యమునకును హరి నిశ్చయించుకొనియున్నాఁడని దెలిపెను. ప్రద్యుమ్నుని భద్రనటకుని గను, గదసాంబుల పారిపార్శ్వక విదూషకులుగను వజ్రపురికి తీసికొనిపోయెను. వజ్రనాభుని సభయందు నాట్యమున కేర్పాటుఁజేసెను. ప్రభావతి గుణచంద్రవతులకు తమపతులరాకఁదెలిపి తమపతులు నాట్యమునలుపు టెఱింగించెను. నాట్యసమయమున ప్రద్యుమ్నుఁడు ప్రభావతినిగూర్చి వజ్రనాభునికి సరిపోలు నర్థమున.

> "నీకు నామీఁదఁగలయట్టి నెయ్యమును మ,హాదరము నీవు పనిచిన హంసిచెప్ప
> నాత్మ లోననవరత నాటకప్రసంగ,మున నినుభజించువేడుక ఘనము నాకు"

యని తన ప్రేమను వెల్లడించగానందులకు ప్రభావతి గుట్టుబయలువడునని భయమందినది. ఆ సందర్భమున శుచిముఖి ప్రభావతికి ప్రద్యుమ్నుని జాణతనమును దెలిపినది. అర్థద్వయమును నివేదించి దిగులు బాపినది. నాట్యావసానమున ప్రభావతీ ప్రద్యుమ్నుల సంయోగమునకుఁ బ్రయత్నించెను. ఆ నాటి రాత్రియే వారిరువురకు సంయోగముఁ గల్పించెను. ప్రభావతీ ప్రద్యుమ్నుల పొలయలుకలను దీర్చినది. అటు తరువాత పింగళి సూరనగారి శుచిముఖికి కొంత విశ్రాంతి కావలసివచ్చెను. ఇంతసేపు శ్రమపడిన శుచిముఖికి పాపము విశ్రాంతి కావలసినదే! అందువలన శుచిముఖికి బదులు రాగవల్లరిని నియమించిరి సూరనగారు.

రాగవల్లరి, ప్రభావతీ ప్రద్యుమ్నుల లజ్జనుబాపి నిరువురిని కలుపుచుండెను. అద్దానిని శుచిముఖిజూచుచు నవ్వుచుండెను. తుదకు వారి ప్రేమకు భంగముకలుగునని వెలుపలికివచ్చెను. ఇక గుణవతీ చంద్రవతులఁ బతుల సంయోగ మొందింప యత్నించెను. నీ పతితోజెప్పి వారిని నీవలె భర్తల పొందుకలుగునట్లు జేయుమని ప్రభావతికి జెప్పెను. మరల నీకు సిగ్గయినచో నేనే దెలిపెదనని ప్రద్యుమ్నునిద్వారా గదసాంబులకు ప్రేమవతుల పొందు గల్పించెను. వీరి కార్యమయిననే మరల మన దేవ

కార్యము సాధ్యమగునని బహుజాగ్రత్తగా దౌత్యమును నడిపెను. ఇట్లు ప్రియుల సమాగమమును శత్రువుల సమరమును రెంటిని జోడించి రాయభారము సలిపెను. శుచిముఖి యుద్ధసమయమున కృష్ణునికి దేవేంద్రునికి త్వరితముగాఁదెలిపి వజ్రనాభునివధకు కారకురాలైనది. ఇంతటి మహత్తర కార్యసాధకురాలైన సూరన వారి శుచిముఖికి తుదకు దేవేంద్రాదు లెవరును కడకు ధన్యవాదములు గూడ దెలుపరైరి. ఈ కార్యసాధనకు నీవేగతియనిన దేవేంద్రుఁడు కార్యమయిన తరువాత కలనైన దలంపలేదు. ప్రియుని సమాగమమునకు నీవే నా ప్రాణమనిన ప్రభావతిగూడ తరువాత దలపలేదు. కడకు ప్రద్యుమ్నాదులుగూడ కృతజ్ఞతలు దెలుపరైరి. మనపింగళి సూరనగారి శుచిముఖికి యభివందనము లక్కరలేదాయెను. తన గ్రంథమే తన శుచిముఖికి ధన్యవాదము లర్పించుచున్నది. కావున నశాశ్వతములైన పాత్రల కృతజ్ఞత లక్కరలేదయ్యెను. పింగళి సూరనగారి శుచిముఖి బహుచతురతలుకలిగి దేవకార్యమును సాధించిన దిటవుకత్తె. పింగళి సూరనగారి శుచిముఖి యిట్టి చతురత్వముకలిగి జగతిలో జాణయై విరాజిల్లుచున్నది.




తొలకరి చినుకులు:— గ్రంథకర్త : ఎమ్మనూరు చినవేంకటరెడ్డి;— క్రౌను సైజు 48 పుటలు ; వెల 0.12.0 వలయువారు గ్రంథకర్తకు - కోడూరు - కడపజిల్లా — అని వ్రాయవలయును.

ఇది తొమ్మిది ఖండకావ్యముల సంపుటి. కవి తొలుతటి కావ్యము కాఁబట్టి, తొలకరి చినుకులను పేరు దీనికి సార్థకము. దేశాభ్యుదయకారులగు కృషికులకు, తొలకరి చినుకులెంత సంతసముఁగూర్చునో, యంతముద మీరచన కవికుమారులకుఁ గలిగించును. ఇందలి యొక్కొక్క ఖండికయు, నవ్యభావములతో, సహజవర్ణనలతో చిత్రింపఁబడినది. శైలి ధారాళముగా నెక్కడనుగుంటువడక, యతిప్రాసలకు వెతకులాడక తిన్నగా సాగినది.

అక్కడక్కడ చక్కని జాతీయములు, సామెతలు మున్నగునవి కవితలో లీనమై మిక్కిలి యందమును గూర్చుచున్నది.

అన్నిటను 'బడిపంతులు' 'కృతఘ్నుఁడు' అను ఖండికలు వాని జీవితమందలి నైరాశ్యమును చక్కఁగా చాటుచున్నది.

చూడుఁడు:—

చాలి చాలని బత్తెంబు జాలిఁగొలుపఁ బ్రొయ్యిలోఁ బిల్లిలేవక ముడిగియుండ
వంటకుండలు దమలోన వాదులాడ నెన్నిదినములు సంసారమన్న నీకు ॥

(బడిపంతులు)

కఠిన దారిద్ర్య మొకదెసఁ గఱచిచంప దైన్యమొకవంక సతికిఁ జిత్తముగలంపఁ
దెంపుమైరెండుచేరినా దుంపఁద్రెంప వీడకెటులుందునయ్య యీపాడుకొంప ॥

(కృతఘ్నుడు)

ఇవి మచ్చునకేకాని ప్రతి పద్యమును కవిభావనాశక్తిని దృఢముచేయుచున్నది.

పీఠికలో విద్వత్కవిభూషణ, విద్వాన్ శ్రీ వేదము వేంకట కృష్ణశర్మగారి "ఈ కవికుమారుని భావనాబల మపారము. ప్రతి పద్యమున నేదో యొక నూత్నభావము ప్రస్ఫుటమగుచుండును. ఈ కావ్యములోని ప్రతి ఖండికయు పఠితల హృదయకుహరములదూఁటి చనునుత్తమ సాంఘిక పరిస్థితుల నవ్యానుభూతిని ప్రసాదింపఁజేయు పాటవముగలది, అన్నియు గంభీరభావ సమంచితములు, సులభగ్రాహ్య విషయములు"-అను ప్రవచనముతోడను అభిప్రాయములోని మహాకవి సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి "ఈ కవికి భావనాబలమున్నది. ఆ భావమును వెల్లడింపఁగల సునిశితమై - వణఁకాదని వాక్కుగలదు"-అను పలుకులతోడ మేమేకీభవించుచున్నారము.

వే. చం.




## విరేచనములు కట్టుటకు

నేరేడుపండ్లు విరేచనముల తీవ్రతను తగ్గించును.

కారము కొద్దిగాగల అల్లపు పచ్చడికాని, అల్లము పైతోలుతీసి చిన్న చిన్న ముక్కలుగా తరిగి నూరిన ఉప్పు నద్దుకొనికాని సేవించినచో విరేచనములు నిమ్మళించును.

ఆలుబఖారాపండ్ల తేలిక కషాయము సేవించుటవలన విరేచనములుకట్టును.

వెలగ చిగుళ్ల కషాయముకూడ విరేచనములచే బాధపడువారికి మేలుచేయును.

కర్పూర సిలాజితుతో వెన్నకలిపి సేవించినచో రక్తాతిసారము, విరేచనములు నిమ్మళించును.

జాపత్రి చూర్ణము అతిసారమును, విరేచనములను నిలుపును.

జీలకర్ర చూర్ణముకాని, కషాయముకాని, నీళ్లతో నూరితీసిన రసముగాని సేవించినచో రక్తాతిసారము, విరేచనములుకట్టును.

కడుపులో నొప్పితో అజీర్ణసంబంధమైన విరేచనములు మెంతులు సేవించుటవలన ఉపశమించును.

నారింజపండ్ల రసంలో తేనెకలిపి సేవించినచో అతిసారము నిమ్మళించును.

గసగసాలను పొడిచేసి, చక్కెరకలిపి సేవించినచో నీళ్ల విరేచనములుకట్టును.

ధనియాలు నీళ్లతోనూరితీసిన రసమును తేనెకలిపి సేవించినచో విరేచనములు కట్టును.

# మన దేశ భాషలకు 'నాగరలిపి'

ధ్వనులకు రూపము లిపి, జీవము అర్థము. భాషకు లిపి, అర్థము అనునవి రెండంగములు. సంస్కృత వర్ణమాలయందు నేఁబది వర్ణములుగలవు. ఆంధ్రమున ముప్పదియేడును (శకటరేఫముతో సహా), తమిళమున ముప్పదియును నక్షరములుగలవు. ఇటులే భాష భాషకును వర్ణమాలయందలి యక్షరసంఖ్య భేదపడుచున్నది. ధ్వనులే యక్షరములని మున్నె నుడివితి. సర్వభాషాధ్వని సంయుక్తమైన లిపియే యేకైక లిపిగానుండ యోగ్యమైనది. అట్టి లిపిలేని నాడు క్రొత్తగా నట్టి దానిని సృజియింపవలయును.

నాగరలిపి కీయర్హత లేదు. దీనియందితర భాషలలోఁగల కొన్ని ధ్వనులు లేవు. ఆంధ్ర తమిళ భాషల తార్కాణముగాఁ దీసికొన్నచో యదార్థము బయలుపడును. తెలుఁగునందలి "ఎ-ఒ-ఁ-చ-జ-ఱ" యను నక్షరములు నాగరలిపియందు లేవు. తమిళ భాషయందలి 'ழ' యను ధ్వనియును లేదు. కాని వీనిలోఁ గొన్నింటికి నాగరలిపియందు ధ్వనిచ్ఛాయలుగలవు. అయినను నవి యర్థాంతరములను గలిగించి చదువరుల విసిగించును. నాగరలిపి ప్రవేశపెట్టినపుడు తెలుఁగునందలి 'ఎ'ను 'ఏ'గాను; 'ఒ'ను 'ఓ'గాను; 'చ'ను 'చా'గాను 'జ'ను 'జా'గాను బలుకవలసివచ్చును. అటుల బలికిన నర్థభేదములు పొడముచున్నవి.

| తెలుఁగు | నాగరలిపి |
|---|---|
| ఎల — అభినవము | ఏల — ఎందుకు |
| ఒలి — ఒలుపు | ఓలి — కుల్యము |
| చవి — గుజ్జుపుజాలు | చవి — ఒక దినుసుమందు |
| జాలము — ఆలస్యము | జాలము — వల |

తక్కిన 'ఁ-ఱ' యను రెండక్షరములు నాగరలిపిలో లేవు. కొన్నిపట్టుల దెలుంగున వీనిని దప్పక గమనించియే తీరవలయును. లేకున్న నర్థాంతరము గల్గును.

| తెలుఁగు | నాగరలిపి |
|---|---|
| నీఱు — బూడిద | నీరు — ఉదకము |
| తఱి — సమయము | తరి — నౌక |
| కఱి — నల్లనిది | కరి — ఏనుఁగు |
| పాఁడి — క్షరము | పాడి — న్యాయము |
| నాఁడు — దినము | నాడు — దేశము |
| మూఁక — సముదాయము | మూక — మూగవాఁడు |

దేశీయభాషలకు నాగరలిపియే యైనచో, నితర ప్రాంతీయ లిపులన్నియుఁ జీకటి కొట్లులలో మానముద్ర వహియించి చెదపురుగులతోఁ జెలిమి సేయవలసివచ్చునేమో! నాగరలిపికి పట్టాభిషేకము సేసిన దాదిగాఁ బామరజనులనుండి పండిత జనుల వఱకు నందఱు పలక, బలపము దీసికొనవలసినదే. ఇంతకుముందున్న వాఙ్మయమంతయు ప్రాంతీయ లిపులలో నుండును గనుక, రెండుమూఁడు తరములు గడచిన తర్వాత వారికి దానిని జదివి యానందించు భాగ్యము లేకపోవును. ఒకవేళ చదువఁగోరినచో లిపిని నేర్చుకొనవలయును. ఈ కష్టమును దొలగించుటకై పూర్వవాఙ్మయమంతయు నాగరలిపిలో ముద్రించవలయును. ఇయ్యది బహువ్యయప్రయాసలతోఁగూడినపని.

ప్రతి మానవునకు భాషాభిమానము, జాత్యాభిమానము, మతాభిమానము, దేశాభిమానము అనెడి నాల్గుగుణములు సహజములు. పలుప్రాంతీయ భాషాభ్యాసనమున నాయాప్రాంతీయులతోడి మైత్రి సేకూ

రుట శోచనీయమైన విషయము గాదు. ఆయా వాఙ్మయములనుండి మేలిరకపు జాతీయములను, పలుకుబడులను, కవితారీతులను, నవ్యభావవిన్యాసములను ఋణికిఁ బుచ్చుకొని తమ వాఙ్మయములఁ బుష్టి గలిగించి తుష్టినొందవచ్చును. అంతియేగాని నష్టి యేమియులేదు. ఇది భాషా సంబంధమైన విషయము. మన చర్చనీయాంశము లిపికి సంబంధించి నదిగాని భాషను సంబంధించినదిగాదు. లిపియే భాషయని భ్రమించి భాషాప్రయోజనముల గురించి పంపాదకీయములో వ్రాయఁబడినవి. అది ప్రమాదమేయని తోఁచెడిని.

చిలుకపలె పలుకుటకు లిపి యుపకరించునుగాని యర్థమెఱుంగుటకుఁ దోడుపడఁజాలదు. చదివి యర్థము దెలియక తిక్కమొగముదాల్చి దిక్కులు చూడవలసినదే. లిపి నేర్చుకొనుట, 'అర్థములేని చదువు వ్యర్థమను' నానుడిని సార్థకము సేయుటే యగును.

వేయేల నాగరలిపి ఏకైక లిపిగా నుండుట కెంత మాత్రము యోగ్యమైనదిగాదు.

(విద్వాన్) రామిరెడ్డి నారాయణరెడ్డి

♦ ♦ ♦

జీవునికి దేహమెట్టిదో భాషకుకూడా లిపి అట్టిదే. హిందీ మన జాతీయభాషయైనట్లు నాగరలిపియు జాతీయ లిపియైనప్పుడే మన దేశంలో దృఢమైన జాతీయత ఏర్పడుతుంది.

మనదేశంలో 100-కి 40 మంది నాగర లిపిలో తమ తమ భాషలను వ్రాయునట్లు తెలియుచున్నది. దక్షిణాది భాషలను - తెలుగు, తమిళము, కన్నడము, మళయాళము; బంగాలీ, ఆసామీ మున్నగు ప్రాగ్దేశ భాషలు; హిందీ, పంజాబీ ఆదిగాగల వుత్తరదేశపు భాషలు; సింధీ, గుజరాతీ, మరాఠీ మొదలైన పశ్చిమ దేశ భాషలలోని మాటలు ఎక్కడో కొన్ని తప్ప; అన్నీ దాదాపు సమానంగానే యున్నవి.

జాతీయాభ్యుదయ దృష్ట్యా మన మాతృ భాషతో బాటు ఇతర ప్రాంతీయ భాషల నభ్యసించుటెంతయు ఆవశ్యకమై యున్నది. అట్టియెడ మనదేశభాషలకు నాగరలిపియున్న అన్యభాషల నభ్యసించుట కది సులభమార్గముగాగలదు. విద్యా ప్రచారానికి, భావప్రచారానికి ఉమ్మడి లిపి చేదోడు వాదోడై విరాజిల్లగలదు.

విభేదాలను విస్మరించి అవిచ్ఛేద్యమైన రాష్ట్రీయ సౌధమును నిర్మించుటకు ఏక లిపి పునాది వంటిది. అట్టి జాతీయలిపి స్థానము నలంకరించి, రాణించుటకు నాగరలిపియే యోగ్యమైనది.

వి. మహిమాదేవి

—— (०) ——

# ప్రజాసామాన్యంలో నైతిక పురోభివృద్ధికి 'అవ్వయ్యార్' చిత్రం విశేషంగా తోడ్పడుతుంది

జమినీవారి 'అవ్వయ్యార్' తమిళ చిత్రము తెలుగు కామెంటరీతో పత్రికా ప్రతినిధులకు 11.9.53 నాడు ప్రదర్శించబడింది. ప్రముఖ పత్రికా రచయితలు శ్రీ ఖాసా సుబ్బారావు, శివలెంక శంభుప్రసాద్, నార్ల వేంకటేశ్వరరావు మొదలగువారు ప్రదర్శనమునకు హాజరయినారు.

ఇందులోని కథావస్తువు తమిళ కవయిత్రి - భక్తురాలు అయిన అవ్వయ్యార్ జీవిత చరిత్రకు సంబంధించినది. మానవసేవయే మాధవసేవగానమ్మి ప్రజలలో న్యాయము, ధర్మము, నీతిని, పరమార్థమును ప్రబోధించడానికి భగవత్ప్రేరితురాలై తన జీవితమును అంకితముచేసిన స్వార్థత్యాగి 'అవ్వయ్యార్'

'అవ్వయ్యార్'యొక్క మానవసేవా తత్పరత భక్తి వైరాగ్యాలు, కవితానైపుణ్యము, బోధనలు రాజాధిరాజులను, సామాన్య ప్రజానీకమును ఆకర్షించినవి. ఆమె బోధనలను విన్నారు. ఆమె చూపిన మార్గాన్ని అనుసరించడానికి ఆసక్తి చూపారు. ఆమె కవిత తమిళ ప్రజానీకంలో విశేషంగా ఆదరాభిమానముల చూరగొన్నది. ఈ విధంగా సకల తమిళ ప్రజానీకంచేత ఆరాధించబడిన అవ్వయ్యార్ చిట్టచివరదాక మానవసేవలో నేగడిపి తన జన్మ సార్థక్యాన్ని పొందింది.

ఈ చిత్రంలో కొన్ని అసాధారణమైనట్టియు, అసహజమైనట్టి సంఘటనలు, సన్నివేశములున్నట్లు కనుపించినా సామాన్య ప్రజానీకంలో అవ్వయ్యార్ జీవిత పరమార్థము, బోధనలు ప్రచారం పొందాలనే ఉద్దేశము నెరవేరడానికి అవి అవసరమైనవి.

జమినీ అధినేత శ్రీ యస్. యస్. వాసన్ యీ చిత్ర నిర్మాణంలో చూపిన ఆసక్తి, 'అవ్వయ్యార్' ఉత్తమ చిత్రంగా తయారుకావడానికి ఉపకరించింది. శ్రీమతి కే. బి. సుందరాంబాళ్ తన్మయత్వంతో తన గానకళా కౌశలాన్ని అమృతపరంగా వరిపించింది.

చిత్రమునకు తెలుగు కామెంటరీ, అక్కడక్కడ సంభాషణలు చాల పొందికగానుండి ఆంధ్ర ప్రజానీకంలో విశేషంగా ఆదరాభిమానముల చూరగొనడానికి అనువుగానున్నది. గోదావరి వరదల భీబత్స సందర్భమున యావదాంధ్ర ప్రజానీకమును సయితము ఉదార హృదయులుగా చేయడానికి 'అవ్వయ్యార్' జీవిత పరమార్థము యీ చిత్రముద్వారా ఎంతైనా ఉపకరించగలదు.

ఈ సందర్భమున శ్రీ ఖాసా సుబ్బారావుగారు, నార్ల వేంకటేశ్వరరావుగారు చెప్పినట్లు 'శ్రీ వాసన్ గారు వినోదంతోబాటు ఉత్తమ ఆదర్శ లక్ష్యాలను ప్రబోధించి నైతిక పురోభివృద్ధికి తోడ్పడగల ఉత్తమ చిత్రాలను యింకా అనేకం నిర్మించగలరనియు, సాంస్కృతికంగా దగ్గర సంబంధముగల ఆంధ్ర, తమిళ ప్రాంతీయులు ఒకరినొకరు అర్థము చేసికొని ఉభయుల సమస్యలను పరస్పర సానుభూతితో పరిష్కరించుకోడానికి 'అవ్వయ్యార్' లాంటి చిత్ర నిర్మాణము అవసరమనుటలో సందేహము లేదు.

సర్వాంగ సుందరంగా నిర్మించబడిన యీ చిత్రము విజయయాత్ర సాగించగలదనుట నిస్సంశయము.

'సిసి'

♦ ♦ ♦

రాజ్యం పిక్చర్స్‌వారి 'బాటసారి' చిత్రనిర్మాణమునకు ఏర్పాట్లు యించుమించుగా పూర్తి అయినవి. శ్రీ తాపీ ధర్మారావుగారు మాటలు వ్రాశారట.

♦ ♦ ♦

జయంతీ ప్రొడక్షన్స్‌వారి 'బంగారుభూమి' చిత్రం తయారగుచున్నది. ఇందులో శ్రీమతి అంజలీదేవి ప్రధాన భూమిక నిర్వహిస్తున్నది.

# వివిధ విషయాలు

## 'రాణీ రుద్రమ' నాటక ప్రదర్శనము

మద్రాసు ఆంధ్ర విజ్ఞాన సమితి (రిజిస్టర్డు)వారు ఆగస్టు 16-వ తేదీన ఎగ్మూరునందలి మ్యూజియం హాలులో 'రాణీరుద్రమ' నాటకము ప్రదర్శించారు.

'రాణీరుద్రమ' జాతీయతను, ఐకమత్యమును, దేశభక్తిని, త్యాగసేవాసక్తిని ప్రబోధించు మహోజ్వలమైన ఆంధ్ర చారిత్రాత్మక నాటకము. దానిని విజ్ఞానసమితివారు చక్కగా ప్రదర్శించి ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్ర ప్రజానీకానికి మహోపకారం చేశారు. ఈ నాటకము నూతన రాష్ట్రావతరణ సందర్భమున ఎంతైన ప్రదర్శన యోగ్యమయినది.



డోగ్రా ఫిలిమ్స్‌వారి 'ఖోజ్'
హిందీ చిత్రంలో హెలెన్

మద్రాసు నగరంలోని ఆంధ్రులను సమీకరించి వారి పురోభివృద్ధికి, విజ్ఞాన వికాసములకు అనేక సంవత్సరములనుండి కృషిచేయుచున్న సంస్థలలో విజ్ఞానసమితియొకటి. దానిని పోషించుకొని నగరంలోని ఆంధ్రప్రజానీకం స్వప్రయోజనాలకు వినియోగించుకొనవలసిన అవసరము మెండుగానున్నది.

'రాణీరుద్రమ' నాటకంలో నటీనటులందరు చక్కగా నటించారు. నాటక శాఖాధికారి శ్రీ ఎం. రామనాథశాస్త్రిగారికృషి ఫలించినదనడానికి యీ నాటకము నిదర్శనము.

ఈ సమితి కార్యదర్శులు శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తి, యన్. సూర్యనారాయణగారను యీ సమితి నిర్వహణయందే కాక 'రాణీరుద్రమ' నాటక ప్రదర్శన సందర్భమున చూపిన ఆసక్తి, ఉత్సాహములు యీ సంస్థకు చక్కని భవిష్యత్తుకలదని సూచించుచున్నవి.

♦ ♦ ♦

## సంతాప సందేశములు

చిత్తూరుజిల్లాయందలి పుత్తూరు మహిళా సమాజమువారు కీ. శే. కేసరిగారికి జోహారులు అర్పిస్తూ వారి మరణంపట్ల తమ సంతాప సూచకంగా శ్రీమతి కే. సుందరీబాయిగారి అధ్యక్షతన తీర్మానించారు.

ఈ తీర్మానములో స్త్రీ జనాభ్యుదయమునకు శ్రీ కేసరిగారు చేసిన అవిరళకృషిని, గృహలక్ష్మి పత్రికద్వారాను, స్వర్ణకంకణ ప్రదానమువలన స్త్రీలకు యిచ్చిన ప్రోత్సాహమును, మద్రాసు నగరంలో వారు స్థాపించిన తెలుగు విద్యాలయాల ప్రాధాన్యాన్ని వివరించారు. ఆరోగ్య సౌభాగ్యాలు సమకూర్చడంలో వారి లోధ్ర, అమృత, అర్క ఔషధములు ప్రశంసించబడినవి.

నూతన రాష్ట్రం ఆంధ్రులకు నిర్మింపబడుచున్న యీ సమయంలో శ్రీ కేసరిగారిని కోల్పోవడం ఆంధ్రులకు తీరనిలోటని వివరిస్తూ శ్రీ కేసరిగారు ప్రారంభించి నిర్వహించిన ఉద్యమమును బలపరచి నిర్వహించాలని 'గృహలక్ష్మి' పత్రికను యావదాంధ్రులు పోషించి మహిళా ఉద్యమ వ్యాప్తికి, పురోభివృద్ధికి వినియోగించుకోవాలని కోరబడింది.

మొరీషీసు ఆంధ్రమహాసభవారు శ్రీ కేసరిగారి మరణముపట్ల తమ సంతాపమును తెలియజేయుచు వారు సాహిత్య, సాంఘిక రంగములలో చేసిన సేవను ప్రశంసించి 'గృహలక్ష్మి' పత్రిక స్థాపన, నిర్వహణమూలంగా మహిళాలోకానికి, ఉద్యమానికి తోడ్పడిన వైనమును వివరించారు. మరియు శ్రీ కేసరిగారి ఆదర్శలక్ష్యాలను మార్గదర్శకంగా చేసికొని విశేషంగా ప్రజాహిత కార్యక్రమాలను నిర్వహించాలని ప్రజలకు సూచించారు.

# సంపాదకీయములు

## ఖాదీ, గృహపరిశ్రమల అభివృద్ధి

మద్రాసు రాష్ట్రంలోనున్న 6 కమ్యూనిటీ ప్రాంతాలకు ఒక్కొక్కదానికి 4½ లక్షల రూపాయలు ఖాదీ, గృహపరిశ్రమల అభివృద్ధికి సహాయం చేయాలని అఖిలభారత ఖాదీ గృహపరిశ్రమలబోర్డు యీ మధ్య ఢిల్లీలో సమావేశమయి సూచించినదట. అంటే మద్రాసుకు కేటాయించబడనున్న 27 లక్షల రూపాయలలో ఆంధ్ర ప్రాంత్యానికి 9 లక్షల రూపాయలు వస్తుంది.

ఈ కేటాయించబడనున్న డబ్బు సద్వినియోగం కావడానికి, దాని ఫలితములు శాశ్వతమైనవిగా నుండటానికి అత్యంత శ్రద్ధాసక్తులు అవసరము.

ఖద్దరు పరిశ్రమ ప్రస్తుతము ఏ పరిస్థితులలోనున్నదో యీ సందర్భమున గమనించవలసియున్నది. తయారయినసరకు విపరీతముగా నిలవయున్నది. సాధారణ పరిస్థితులలోనే ఖద్దరువెల అధికము; పైగా సామాన్య ప్రజానీకపు కొనుగోలు శక్తి క్రమంగా నశిస్తున్న యీ రోజులలో ఖద్దరు ధారణయందు ఆసక్తిగలవారు సయితము హెచ్చు ధరలనుచూచి వెనుకంజవేయక తప్పడంలేదు.

ఈ పరిస్థితులలో ఖద్దరు పరిశ్రమాభివృద్ధికి కొన్ని రక్షణలు ఏర్పడిననేగాని సామాన్య ప్రజానీకం సయితము పరిశ్రమాభివృద్ధియెడల ఆసక్తి చూపలేరు.

ఖాదీ పరిశ్రమకు అవసరమయిన ముడిపదార్థములధర తగ్గాలి. ముఖ్యంగా స్త్రీలు నూలు వడుకుటయందు ఆసక్తి చూపాలి. తయారయిన గుడ్డను విక్రయించుటకు అవకాశములు, ప్రచారము మెండుగా నుండాలి. ఇవి సమకూరిననాడు ఖద్దరు పరిశ్రమాభివృద్ధి కవకాశములున్నవి.

ఇక గృహపరిశ్రమలను మొత్తంగా పరిశీలిస్తే చేనేతపరిశ్రమలాంటి గృహపరిశ్రమ యీనాడు పతనావస్థయందుండుటకు కారణము తెలిసికుంటే గృహపరిశ్రమల అభివృద్ధికిగల అవకాశములు అర్థముకాగలవు.

యంత్రపరిశ్రమతో గృహపరిశ్రమలు ఏనాడును పోటీకి నిలవలేవు. యంత్రసహాయంతో శీఘ్రకాలంలో, ఉత్పత్తి ఎక్కువ; ఉత్పత్తిదారులకయే వ్యయం తక్కువ కాబట్టి తయారయిన వస్తువులను తక్కువ ధరలకు అమ్మడానికి అవకాశముంటుంది. పైగా నాణ్యంలోకూడ గృహపరిశ్రమలలో తయారయిన వస్తువులకంటె యంత్ర సహాయంతో తయారయినవి మేలుగా నుంటవి. కనుక చవుకగాను, నాణ్యంగాను కనుపిస్తున్న యంత్రసహాయంతో తయారయినవానిపై ప్రజలు ఎక్కువమోజు చూపించుటలో విశేషములేదు. కాని ప్రజలలో నిరుద్యోగ నిర్మూలనకు గృహపరిశ్రమల అభివృద్ధి అత్యవసరము. అందుకని యంత్రపరిశ్రమనుండి గృహపరిశ్రమలను రక్షించవలసిన అవసరం చాల మెండు.

యంత్రపరిశ్రమలను పూర్తిగా నిరాకరించలేము. గృహపరిశ్రమలకు అలివికానివి, శీఘ్రగతిని ప్రజావసరాలను తీర్చవలసినవానిని యంత్రములద్వారా తయారుచేసికొనవచ్చును. ఇంకా యితర దేశాలతో వ్యాపార వాణిజ్యాల కవసరమయిన ఉత్పత్తిని యంత్రములద్వారా నిర్వహించుకోవచ్చును. కాని గృహ

పరిశ్రమలద్వారా ప్రజావసరాలు తీరగల వస్తువుల ఉత్పత్తి దేశాభ్యుదయానికి, నిరుద్యోగ నిర్మూలనకు అత్యధికంగా నుపకరించగలదు.

గృహపరిశ్రమల అభివృద్ధిని సాధించాలంటే యంత్రపరిశ్రమలవలన గృహపరిశ్రమలకు ముప్పయుండకూడదు. గృహపరిశ్రమలద్వారా ప్రజావసరాలు గడిచే వస్తువులను యితరదేశాలనుండి దిగుమతిచేయడం నిషేధించాలి; యంత్రసహాయంతో ఉత్పత్తిచేయడం పరిమితంచెయ్యాలి. గృహపరిశ్రమలలో ఉత్పత్తి అయ్యే వస్తువులు సయితము నాణ్యంగాను, ఆకర్షణీయంగానుండి, వాని ధరలు ప్రజానీకానికి అందుబాటులో నుండాలి. గృహపరిశ్రమలకు అవసరమయిన ముడిపదార్థములు, ఆర్థిక సహాయము ప్రతిసామాన్యం కుటుంబానికి అందుబాటులో నుండాలి.

ఖాదీ, గృహపరిశ్రమల అభివృద్ధి ప్రణాళిక నమలుపరచే సందర్భమున పైవిషయాలనుపాటిస్తే దేశంలోని నిరుద్యోగము, కూడుగుడ్డలేమిలాంటి సమస్యల పరిష్కారానికి చాల మేలు సమకూరుతుంది.

## శ్రీ విజయనామ సం॥ర భాద్రపద ఆశ్వయుజ మాసములు.

| నెల | తేది | వారం | వివరాలు |
|---|---|---|---|
| 1953 సం॥ సెప్టెంబరు నెల | 16 | బు | అ 39.14 జ్యే 12.27 త్యా 4.5 వరా 7.1 మో 8.39 క |
| | 17 | గు | న 38.10 మూ 13.39 ది 9.34 రా 7.21 |
| | 18 | శు | ద 35 56 పూషా 13.38 త్యా 3.55 క్షీరవ్రతారంభం |
| | 19 | శ | ఏ 32.31 ఉషా 12.24 ది 22.2 సర్వేషాంఏకాదశి |
| | 20 | ఆ | ద్వా 27.4 శ్ర 10.10 ది 19.38 కల్కిద్వాదశి |
| | 21 | సో | త్ర 22.45 ధ 6.55 వవ 3.20 మో 4.57 కంతిధిద్వయ |
| | 22 | మం | చతు 16.49 శత 2.58 పూ.భా 55.32 అనంతవ్రతం |
| | 23 | బు | ○ పూ 10.26 ఉభా 53.57 ది 2.41 |
| | 24 | గు | బ. పాడ్యమి 3.53 ఏష్యా 53.44 ది 21.42 |
| | 25 | శు | తదియ 51.34 అశ్వ 45.27 వరా 8.20 మొ 9.50 క |
| | 26 | శ | చ 46.38 భ 42.16 హ 43.12 త్యా 3.46 భరణిమహాలయం |
| | 27 | ఆ | పం 41.50 కృ 39.2 ది 10.39 గజగౌరివ్రతం |
| | 28 | సో | ష 38.43 రో 37.24 ది 17.51 |
| | 29 | మం | స 36.10 మృ 36.54 త్యా 4.3 వతే 5.8 మొ |
| | 30 | బు | అ 35 8 ఆ 37.33 శేషం 2.11 వర్జ్యలేదు, మధ్యాష్టమి |
| 1953 సం॥ అక్టోబరు నెల | 1 | గు | న 35 22 పున 39.27 ది 8.30 దుర్గోత్థాపనం |
| | 2 | శు | ద 36.42 పుష్య 42.40 ది 0.31 వ ఉ 6.3 మొ 7.44 క |
| | 3 | శ | ఏ 39.14 ఆశ్రే 46.3 ది 16.44 పర్వోపవాసః |
| | 4 | ఆ | ద్వా 42.39 మఘ 51.32 ది 19.2 |
| | 5 | సో | త్ర 46.41 పూఫ 56.59 ది 13.21 |
| | 6 | మం | చతు 51.11 ఉఫ 60.10 త్యా 4.23 |
| | 7 | బు | ● అమా 55.48 ఉఫ 2.48 ది 25.54 |
| | | | **ఆశ్వయుజమాసం** |
| | 8 | గు | శుక్లపాడ్యమి 60.10 హ 8.49 త్యా 4.23 శరన్నవరాత్రారంభం |
| | 9 | శు | శుక్లప్రతి 0.23 చి 14.36 వరా 5.49 చంద్రోదయం |
| | 10 | శ | విదియ 4.30 స్వా 19.54 రా 5.33 త్యా 4.18 |
| | 11 | ఆ | తదియ 7.55 విశా 24.31 త్యా 4.15 వరా 7.58 మొ 9.40 క |
| | 12 | సో | చ 10.28 అనూ 28.13 త్యా 4.11 వరా 11.2 మొ 12.45 క |
| | 13 | మం | పం 11.55 జ్యే 30.52 సౌ 18.23 లలితాగౌరివ్రతం |
| | 14 | బు | ష 12.12 మూ 32.18 ది 28.12 సరస్వతిపూజా |
| | 15 | గు | స 11.15 పుషా 32.3 అతి 12.11 గజగౌరివ్రతం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd, 15. Westcott Road, Royapettah, Madras.

Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | నాచిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కె. యన్. కేసరిగారు | 3 0-0 |
| 2. | ఫిలోమెనాతంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | 0-12-0 |
| 3. | నవమణిమాల (నవల, తమిళం) : శ్రీమతి యస్. ఆర్ జయలక్ష్మి | 0-12-0 |
| 4. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కె. యన్. కేసరిగారు | 0-12-0 |
| 5. | బిల్వ (వైద్యగ్రంథము) : ,, | 0-12-0 |
| 6. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1-0-0 |
| 7. | శ్రీ జ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0-6-0 |

## మా దగ్గర లభించు గ్రంథము

దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు 12-8-0

'నాచిన్ననాటి ముచ్చట్లు' అమ్మకమునకు సిద్ధముగానున్నది

## 'గృహలక్ష్మి' స్త్రీల మాసపత్రిక

### దసరా సంచిక 15-10-53 న వెలువడును

20 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషిచేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక. త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాల తోటి, యింకా గృహవైద్యము, కథలు, సినిమారంగము, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 0-6-0

మా ఏజంట్లు లేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను.

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

